## మరో సీక్వెల్ సిద్ధం





బాలీవుడ్ ధీరుడు దేశంలో పెద్ద స్టార్ సల్మాన్‌ఖాన్ ఇపుడు వరుస సీక్వెల్ సినిమాలతో మరో రెండేళ్లకు సరిపడా పనితో బిజీగా ఉన్నాడు. 'దబాంగ్- దబాంగ్2 బాక్స్ ఆఫీసువద్ద ఎటువంటి కలెక్షన్లు చేశాయో అవి చేసిన రికార్డులు చెబుతాయి.. ఇపుడు ఈ రెండు చిత్రాలకు సీక్వెల్ దబాంగ్ 3 తీయటానికి సన్నాహాలు చేస్తున్నారు. విషయం ఏంటి అంటే- ఈ సినిమాను సల్మాన్ వాంటెడ్ మూవీని డైరెక్టు చేసిన ప్రభుదేవా దర్శకత్వం చేయనున్నారు..

## బిజీగా ఉందట!

పవర్ స్టార్ గబ్బర్ సింగ్‌లో నటించి గోల్డెన్ లెగ్‌గా మారిపోయింది శ్రుతిహాసన్.. అప్పటినుంచి తెలుగు, తమిళంలో బిజీ అయినా శృతి స్టార్ హీరోలందరితో జోడీ కడుతూనే.. బాలీవుడ్ మీదున్న మోజుతో వీలుచిక్కినప్పుల్లా హిందీ సినిమాల్లో నటిస్తోంది. అయితే కొన్నాళ్లు గోల్డెన్ లెగ్‌గా టాప్ పొజిషన్‌లో ఉన్న అమ్మడు ప్రస్తుతం సినిమాలు చేతిలో లేక కబుర్లు చెబుతోందట.. మొన్నటికి మొన్న 'కాటమరాయుడు'లో డీ-గ్లామరస్‌గా కన్పించిన శృతిపై నెగెటివ్ కామెంట్స్ పడిన విషయం మరువక ముందే తమిళంలో 'సంఘమిత్ర' చిత్రంనుంచి తప్పుకుని ఓవరాక్షన్ చేసిందంటున్నారు. అయితే అవకాశాలు లేకపోవటాన్ని అమ్మడు బాగానే కవర్ చేస్తోందట. ఎలా అంటే- సినిమాల్లో నటించటంతోపాటే మరికొన్ని విషయాల్లో శృతి బిజీ కావాలనుకుందట.. తనకు పరిచయమున్న మ్యూజిక్‌తోపాటే, సినిమాలకు స్క్రిప్టులు తయారు చేయటం, పాటలు పాడటం వంటివి కూడ చేస్తోందట.. మ్యూజిక్ మీద పూర్తి దృష్టిపెడుతున్నానని, అలాగే ఒక మ్యూజిక్ ఆల్బమ్ తయారుచేసి పాటలు పాడటం వంటివి చేస్తానని చెబుతోంది.. సినిమాలకు స్క్రిప్టులు కూడ తయారు చేస్తానంటోందట.. ఇలాంటివి చేయటం వలనే సినిమాలను కాస్త తగ్గించుకున్నానని చెబుతోందట. ఏదేమైనా అమ్మడు మాత్రం ఇపుడు అన్ని రంగాలలో తనదైన ముద్ర వేయటానికి రెడీ అవుతోందని అంటున్నారు సినీ జనాలు..



తారాతీరం

## రిలీజ్ డేట్ మళ్లీ వాయిదా

వరుసగా వాయిదా పడుతూ వస్తున్న రెజీనా నటించిన తమిళ చిత్రం 'నెంజమ్ మరపతిల్లై' ఈ రంజాన్‌కు విడుదల కావాల్సి ఉంది.. తాజా సమాచారం ప్రకారం ఈ చిత్రం మరోమారు వాయిదా పడింది.. దీంతో రెజీనాకు మళ్లీ నిరాశే ఎదురైందని అంటున్నారు. సెల్వరాఘవన్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంపై రెజీనా భారీ ఆశలు పెట్టుకుని ఉందట.. ఈ మధ్య కాలంలో సరైన అవకాశాలు లేక ఇబ్బంది పడుతోందని అంటున్నారు.. నెంజమ్ మరపతిల్లై చిత్రం వాయిదా పడడం రెజీనాకు నిరాశ కలిగించే అంశమే అనడంలో సందేహంలేదు. ప్రముఖ దర్శకుడు గౌతమ్ మీనన్ ఈ చిత్రాన్ని నిర్మాత.

కె.లీలా సువర్ణ

ఆదివారం వార్త

18 జూన్ 2017

## విషయ విశేషం



## మంచి ముత్యాలు

ఎలా పుస్తకాలు చదవాలో తెలిసిన వ్యక్తికి తనను తాను బాగా పెంచుకొనే శక్తి ఉంటుంది. అంటే..అతనివద్ద జీవితాన్ని పరిపూర్ణం చేసుకొనే శక్తి, ఆసక్తికరమైనదిగా మార్చుకునే శక్తిఉంటుంది.

-అల్డస్ హక్స్ లీ




## భావ వీచిక



### తెలుగు మదిని దోచిన కవి!

తెలుగునేల నలుచెరగులా, విదేశాలలో సైతం తెలుగువారున్న వివిధ ప్రాంతాలలో తరచు మార్మోగే పేరు ఏదైనా ఉదంటే అది సినారె. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత సి. నారాయణ రెడ్డి కేవలం కవి, సాహిత్య కారుడు మాత్రమే అయ్యుంటే ఆయన సాహితీలోకానికే పరిమితమయ్యేవారేమో. ఆయన సినీగీత రచయిత కావడంతో జన సామాన్యాన్ని అమితంగా రంజింపజేసి వారికి ప్రీతిపాత్రులయ్యారు. ఒకటా, రెండా .. 3,500 సినీగీతాలు రచించిన ఖ్యాతి సినారెది. ఆయన పాటకు అందని భావాలు లేవేమో. ప్రేమకు, మమతకు, భక్తికి, విరక్తికి, విరహానికి, కోపానికి, బాధకు..ఇలా అనేకానేక భావోద్వేగాలను గీతాలలో అనుపమానంగా ఇమిడ్చారు. 'ఏకవీర'లో 'తోటలో నా రాజు తొంగిచూసెను నాడు.. అంటూ వలచిన వాడి నవ్వును వర్ణించిన తీరు..'నవ్వులా అవి, కావు నవ పారిజాతాలు.. రవ్వంత సడిలేని రసరమ్య గీతాలు' అంటారు. ఎంత చక్కటి భావుకత! 'అమరశిల్పి జక్కన'లో 'ఈ నల్లని రాళ్లలో ఏ కన్నులు దాగెనో...అంటూ 'కదలలేవు, మెదలలేవు, పెదవి విప్పి పలుకలేవు..ఉలి అలికిడి విన్నంతనే జలజలమని పొంగి పొరలు ...పైన కఠినమనిపించును, లోన వెన్న కనిపించును..జీవమున్న మనిషికన్న శిలలే నయమనిపించును' అంటారు. శిల్పికి శిల పట్ల ఉండే భావనను ఇంత గొప్ప పాట గా రాయటం సినారెకే సాధ్యమైంది. జంట నగరాలను వర్ణిస్తూ రాసిన 'రిమ్‌ఝిమ్ రిమ్ ఝిమ్ హైదరబాద్...'లో నగర వర్ణన తోపాటు ఒక తలపై రూమీటోపి, ఒక తలపై గాంధీ టోపి.. ఏమోయని అంటాదొకడు, క్యాభాయ్ అని అంటాడొకడు.. మతాలు భాషలు వేరైనా మనమంతా భాయీ, భాయీ..' అంటూ సమైక్యతను, సోదర భావాన్ని ప్రభోదిస్తారు. 'నీ ధర్మం, నీ సంఘం, నీదేశం.. నువు మరవద్దు, జాతిని నడిపి, నీతిని నిలిపిన మహనీయులనే మరవద్దు' అని మహత్తర సందేశమిచ్చిన సినారె భళారే. నన్ను దోచుకొందువంటే..' అని తొలిగీతంతోనే సినారె తెలుగు మదిని దోచేసుకున్నారు. ఆయన పాటలు ఎన్నికాలాలైనా ప్రజల నాలుకలపై నిరంతరం నర్తిస్తూనే ఉంటాయి. సినారె 'అక్షరాలా' అజరామరుడు!

## లేఖలు

### ..ఘనత వార్తదే!

జూన్ 4 వార్త ఆదివారం అనుబంధంలో దా'సరి' లేరు-కృషిని నమ్మిన దర్శక రుషి! కవర్ స్టోరీ చాలా బాగుంది. అన్ని పత్రికల కంటే ముందుగా ఆదివారం అనుబంధంలో ప్రత్యేక వ్యాసం అందించిన ఘనత 'వార్త'దే. అందుకు మీకు అభినందనలు.

-ఎల్. ప్రఫుల్లచంద్ర, ధర్మవరం.

### ఎన్నో విశేషాలు..

జూన్ 4 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన కవర్‌స్టోరీ కథనం దా'సరి'లేరు... ఆయన గురించిన ఎన్నో సినీరంగ విషయాలు తెలిపింది. దర్శకుడుగా, సినీనటుడుగా, నిర్మాతగా, పాటలరచయితగా, చివరికి రాజకీయవేత్తగా పేరు గడించటం గొప్ప విశేషమే. ఇక 'గ్లోబల్ కష్టం..వానా క్రైలో' కంప్యూటర్ డాటాను సురక్షితంగా మార్చటానికి ఇచ్చిన సూచనలు ఉపయోగకరంగా ఉన్నాయి.

-పక్కి రాధాగోపాల కృష్ణ, విశాఖపట్నం.

### అలరిస్తోంది..

వార్త ఆదివారం మేగజైన్‌లో 'నవ్వుల్ రువ్వుల్' శీర్షిక మేగజైన్‌కే హైలైట్. పాఠకుల హాస్య రచనలను చదివి, ఆనందించడమేగాక, పాఠకలోకాన్ని నవ్వించే అవకాశం అందుకుంటున్నందుకూ ఆనందంగా ఉంది.

-సరికొండ శ్రీనివాసరాజు, వనస్థలిపురం.

### అసలైన నివాళి..

జూన్ 4 వార్త ఆదివారం మేగజైన్‌లో 'దా 'సరి' లేరు..నిజంగా కృషిని నమ్మిన గొప్ప దర్శక రుషికిచ్చిన అసలైన నివాళి! కేవలం దర్శకుడిగానే కాకుండా, రచయితగా, గీత రచయితగా, నటుడిగా, నిర్మాతగా ప్రేక్షక లోకాన్ని అలరించిన 'దర్శక రత్న' లేని లోటు ఎవరూ తీర్చలేనిది. 'మూడో కన్ను'లో 'రజనీ రాజకీయం' రసవత్తరంగా, ఆసక్తికరంగా సాగింది. ప్రస్తుతరుణంలో తమిళనాడు వంటి రాష్ట్రానికి అతనివంటి కొన్ని ఉత్తమ సిద్ధాంతాలననుసరించే వ్యక్తి ముఖ్యమంత్రిగా రావలసిన అవసరం ఎంతైనా ఉందనిపిస్తుంది.

-అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, కూకట్‌పల్లి.

### సందర్భోచితం..

జూన్ 4 వార్త సన్‌డే మేగజైన్ దాసరి ముఖచిత్రంతో, అంతకుమించి దాసరి, పద్మల అన్యోన్యతపై ప్రకాశంగారి ఆర్టికల్‌తో ఈవారం సంచికకు ఒక ప్రత్యేక గౌరవం అబ్బింది. దేవరాజు మహారాజు కథ 'పశువు- ఒక మనిషికథ ' చక్కని నీతిని తెలిపింది. భయానికి రెండు ముఖాలు కవిత బాగుంది. హస్తి మశకాంతరం' కథ బాగా కుదిరింది. ట్రీ అంబులెన్స్ వృక్షపరిరక్షణకు చక్కని ఉదాహరణ. సమతులాహారం ఆవశ్యకతపై 'సంఘీ 'భావం' బాగుంది. మంచి అంశాలనందించిన మీకు మా అభినందనలు.

-డా.శివభూషణం, కర్నూలు.

'సంఘీ'భావం



# లింగ సమానత్వం దిశగా..

దేశంలో లింగ సమానత్వమనేది కేవలం నినాదానికే పరిమితం చేయకుండా ఆచరణలో నిజం చేసే ప్రయత్నాలకు అంకురార్పణ జరిగింది. మున్ముందు మరిన్ని విప్లవాత్మక మార్పులు ఈ దిశలో రాబోతున్నాయి. ఇన్నాళ్లు మహిళలను వంటింటి కుందేళ్లుగా మార్చిన విషయం గత చరిత్రగా మారిపోనున్నది. పురుషులతో సమానంగా అన్నింటిలో అవకాశాలు ఇవ్వాలని ఎంతో కాలంగా మహిళా ఉద్యమకారులు ఆందోళనలు చేస్తున్నారు.

వివిధ రంగాల్లో మహిళల పట్ల కొనసాగుతున్న వివక్ష, అణచివేతను నిరసిస్తూ వారు అనేకానేక నిరసనలు చేపట్టారు. కానీ ఇప్పటిదాకా వాటిని పాలకులు పట్టించుకోలేదు. కానీ మహిళలపట్ల పాలకుల్లో ఇటీవల కాలంలో గణనీయమైన మార్పు కనిపిస్తున్నది. ఆలోచనలు మారుతున్నాయి. దీనిని కొందరు మహిళా ఓట్ల ఎత్తుగడ అని కొట్టిపారేయవచ్చు. కానీ ఓట్ల ఎత్తుగడ, మర్మం ఉన్నా మహిళలకు మేలు చేసే ఏ అభ్యుదయ నిర్ణయాన్నయినా అంతా హర్షించాల్సిన అవసరం ఏర్పడింది. ఈ కోవలోనిదే సైన్యంలోకి మహిళలను యుద్ధ విధుల్లోకి తీసుకోవాలనేది. ఈ నిర్ణయాన్ని ఏ రాజకీయవేత్తో ప్రకటిస్తే పట్టించుకోవాల్సిన పనిలేదు. సాక్షాత్తు దేశ సైనికాధిపతి జనరల్ బిపిన్ రావత్ ఇటీవల ఒక సమావేశంలో మాట్లాడుతూ– ఇకపై మహిళలను మిలిటరీ పోలీసులుగా, ఆ తరువాత యుద్ధ విధుల్లోకి తీసుకుంటామని ఆయన ప్రకటించారు. ఇప్పటివరకు దేశ రక్షణకు కీలకమైన ఆర్మీ, నేవీ, ఎయిర్‌ఫోర్స్ విభాగాల్లో మహిళలు లేరని కాదు. అన్ని విభాగాల్లోని మహిళలను తీసుకోకుండా కొన్ని విభాగాలకే వారిని పరిమితం చేసారు.

సైన్యం విషయానికి వస్తే ఇప్పటివరకు వారిని మెడికల్, లీగల్, విద్య, సిగ్నల్, ఇంజినీరింగ్ విభాగాల్లో మహిళా అధికారులను నియమించారు. వారు విజయవంతంగా విధులను నిర్వర్తిస్తున్నారు. కానీ అసలైన యుద్ధరంగంలోకి దిగి పోరాడే సైనికుల పాత్రను వారు పోషించటం లేదు. ఈ రంగాన్ని కేవలం ఇప్పటిదాకా పురుషులకే పరిమితం చేశారు. కానీ ఇకపై సైనిక నియామకాల్లో మహిళలు ముందుకు వస్తే వారిని పురుషులతో సమానంగా యుద్ధ క్షేత్రంలో పనిచేసేలా అవకాశం ఇస్తామని చేసిన రావత్ ప్రకటన లింగ సమానత్వాన్ని కోరే అభ్యుదయవాదులకు సంతోషం కలిగిస్తున్నది.

ప్రపంచంలో అభివృద్ధి చెందిన అమెరికా, యూరప్, ఆస్ట్రేలియా, కెనడా లాంటి దేశాల్లో సైనికులుగా మహిళలను నియమిస్తున్నారు. వారు పురుషులతోపాటు ఏమాత్రం వెనుకడుగు వేయకుండా యుద్ధరంగంలోకి వెళ్లి దేశంకోసం ప్రాణత్యాగాలు చేస్తున్నారు. కానీ భారతదేశంలో మాత్రం ఇప్పటివరకు ఈ విభాగాన్ని మహిళలకు నో ఎం ట్రీ జోన్‌గా ప్రకటించారు.

కేంద్రంలో మహిళల సాధికారత పట్ల శ్రద్ధ పెరగడం, ప్రభుత్వం అనేక మహిళా అనుకూల విధానాలు ప్రవేశపెట్టుండడంతో ఆర్మీ ఆలోచనల్లో కూడా మార్పు వచ్చిన ఫలితమే రావత్ ప్రకటనగా పరిగణించవచ్చు. అయినా ఇప్పటికీ సైన్యంలో మహిళలేమిటి? వారు యుద్ధం చేస్తారా? చేస్తే యుద్ధంలో శత్రువుల చేతికి వారు చిక్కితే వారి పరిస్థితి ఏమిటి? అని పాతకాలపు ఆలోచనలతో వ్యతిరేకించేవారు కూడా ఉన్నారు. కానీ ఇలాంటి వ్యతిరేకతలను కాలం చెల్లిన ఆలోచనలను పట్టించుకోవాల్సిన అవసరం లేదు. యుద్ధరంగంలోకి మేము సైతం... అని ముందుకు వచ్చే మహిళలను సాదరంగా ఆహ్వానించడాన్ని మించిన సంస్కరణ మరొకటి ఉండదు. ఇదే దేశంలో లింగ సమానత్వానికి సంపూర్ణ స్వాగతమని ప్రకటించలేం. కానీ ఈ దిశగా ప్రభుత్వం, లేదా పాలకుల్లో ఆలోచనలు మారుతున్నాయని, లింగ సమానత్వం దిశగా అడుగులు పడుతున్నాని చెప్పవచ్చు. మహిళలు ప్రవేశించని రంగం లేదు. అవకాశం ఇస్తే దానిని పురుషులకన్నా మిన్నగా విజయవంతం చేసే మహిళా యోధులు అనేకమంది ఉన్నారు. కేవలం మహిళ అన్న కారణంగా ఫలానా రంగంలో పని చేయలేరనే ఆలోచనలు తప్పని నేటి ఆధునిక మహిళలు నిరూపిస్తున్నారు. ఇండియన్ ఎయిర్ ఫోర్స్ ఏడాది క్రితమే ముగ్గురు మహిళా పైలట్లను ఫైటర్ విభాగంలోకి తీసుకున్నారు. వారు అక్కడ ఏమాత్రం సంకోచం లేకుండా ఫైటర్ ఫ్లైట్స్‌లో పైలట్లుగా సాహసంతో విధులు నిర్వర్తిస్తున్నారు. ఈ విజయం చూసి ఆర్మీ చీఫ్ రావత్ ఆలోచనలో మార్పు వచ్చిన తరువాత మహిళలను యుద్ధరంగంలోకి ఆహ్వానించబోతున్నట్లు ప్రకటించారు. అయితే మొదట వీరిని మిలిటరీ పోలీసు విభాగంలోకి జవాన్లుగా, ఆ తరువాత సైనికులుగా పురుషులతో పాటుగా తుపాకులు చేపట్టి రణరంగంలోకి దూకే అవకాశం కల్పించబోతున్నామని రావత్ ప్రకటించారు.

ఆర్మీ, నేవీ, ఎయిర్‌ఫోర్స్‌లో మహిళలను పురుషులతో కలిసి భుజం భుజం కలిపి పనిచేసే అపూర్వ అవకాశాన్ని ఆ మూడు విభాగాలు కల్పించాలి. దీనికి కేంద్ర ప్రభుత్వం కూడా అనుమతించాలి. అప్పుడే మహిళలు సాహసంగా ముందుకు వచ్చి దేశ రక్షణ పథంలో కూడా అగ్రస్థానంలోకి వచ్చే అవకాశం ఏర్పడుతుంది. అయితే ఇంకా ఇప్పటికీ పితృస్వామిక వ్యవస్థ, పురుషాహంకార ధోరణులు రాజ్యం చేస్తున్న సమాజంలో అన్ని రంగాల్లో లింగ సమానత్వం వచ్చినట్లే అని రావత్ ప్రకటనతో చెప్పలేం. కానీ ఈ దిశగా ఆలోచనలు మారడం ఆహ్వానించాల్సిన విషయమే. మహిళా సాధికారత అనేది కల కాకుండా నిజం కావడమనేది పాలకుల చేతుల్లోనే ఉంది. ముఖ్యంగా చట్టసభల్లో మహిళలకు మూడో వంతు రిజర్వేషన్ అనేది ఇంకా బిల్లుల ఆమోదం దశలోనే నలుగుతున్నది. ఈ బిల్లు చట్టం కాకుండా అడ్డుకునేవారు అనేక పార్టీల్లో ఉన్నారు. దేశ ప్రధాని ఇందిరాగాంధీ విజయవంత పాలన, అనేక రాష్ట్రాల్లో మహిళా సి.ఎంల సమర్థవంత, జనాకర్షక పాలనను చూసిన తరువాత కూడా ఇంకా అనేక మంది మహిళల రిజర్వేషన్లను పెంచడాన్ని అంగీకరించలేకపోతున్నారు. పురుషులు ముందుగా మహిళలపట్ల తమ ఆలోచనా ధోరణులను మార్చుకోవాలి. మహిళా, పురుషుడు కలిసి పనిచేస్తేనే కుటుంబమైనా, దేశమైనా, సమాజమైనా శాంతంగా, స్థిరంగా, సౌభాగ్యంగా వర్ధిల్లుతుంది. లేదంటే మహిళల్లో నెలకొనే అశాంతి అది అనేక వైఫల్యాలకు దారి తీస్తుంది. కేవలం ఆర్మీలోకి మహిళలను ఆహ్వానించడమే కాకుండా మహిళాభివృద్ధికి ఆటంకంగా ఉన్న అనేక చట్టాల్లో మార్పులు తీసుకురావడమే కాకుండా అవి అమలు కావడానికి పాలకులు నడుం బిగించినప్పుడే దేశంలో మహిళలకు నిజమైన సాధికారత, లింగ సమానత్వం వస్తుంది.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ



# రైతుని బతికించండి..

**- ఎ.వి.వి. ప్రసాద్**

రైతు గుండెపైన రైఫిళ్లు గురిపెట్ట
దేశ ప్రజలకెటుల తిండి దొరుకు?
రైతు బతుకలేని రాజ్యాలు నిలుచునా!
విశ్వవినుత నామ! వినురవేమ!!

ఇవాళ రైతులోకం అశాంతితో రగిలిపోతోంది. దాని నేపథ్యం ఒకటి రెండు రోజులది కాదు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత గత ఏడు దశాబ్దాలుగా పేరుకుపోతూ వచ్చినదే. ప్రభుత్వాలు ఎప్పటికప్పుడు తీసుకొనే కంటితుడుపు చర్యలతో తాత్కాలిక ఉపశమనం కలిగితే కలగవచ్చుగాని దానివల్ల దేశంలో ఒక్క రైతుకూడా నవ్వుతూ బతకలేకపోతున్నాడు. ఏ ఒక్క రాష్ట్రంలోను రైతులు ఇప్పుడు సంతోషంగా లేరు, సంతృప్తిగా లేరు. తమిళనాడు, మహారాష్ట్రాల్లో కొద్ది నెలల క్రితం మొదలైన ఆందోళనలు అన్ని రాష్ట్రాలకు విస్తరిస్తున్నాయి. కొన్ని రాష్ట్రాలలో అమలు చేస్తున్న రైతు రుణమాఫీ వారికి వరమో కాదోగాని మరింత పెనుభారం మోపుతోంది. మధ్యప్రదేశ్‌తో పాటు రాజస్థాన్, పంజాబ్ రైతులు కూడా రగిలిపోతున్నారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణలో రోజూ ఏదో ఒకచోట నుంచి రైతు ఆత్మహత్యలు వినబడుతూనే ఉన్నాయి.

రైతులెందుకు రోడ్డెక్కుతున్నారు? ఒక ప్రాంతం కాదు, ఒక జిల్లా కాదు, ఒక రాష్ట్రంలో కాదు..మొత్తం దేశమంతా దాదాపు అన్ని రాష్ట్రాలలో రైతులు ఇప్పుడు పొలాల బాట వదిలేసి, ఆందోళనలతో రోడ్డుపైకి వస్తున్నారు. దానిలో విచిత్రం ఏముంది! వారి డిమాండ్ల కోసం వారు ఆందోళన చేస్తున్నారు.. అని సరిపెట్టుకొనేవారు ఉంటే ఉండవచ్చు. కానీ అది అలా తేలికగా చూడవలసిన సమస్య కాదు. తమిళనాట తమ పొలంపనులను ఎక్కడికక్కడ వదలివేసి ఢిల్లీలోని జంతర్‌మంతర్ వద్ద నెలరోజులు పైగా రైతులు నిద్రాహారాలు లేకుండా ఆందోళన జరిపారంటే అది చిన్న విషయమా! మహారాష్ట్ర లో ఇటీవల రైతులు వ్యవసాయాన్ని పక్కనపెట్టి దాదాపు రెండు వారాలు సమ్మె జరిపారంటే అది మామూలు విషయమా! మధ్య ప్రదేశ్‌లో జూన్ 6వ తేదీన ఆరుగురు రైతులు పోలీసు తూటాలకు బలైపోయారంటే అది ఒక సాధారణ సమస్యగా తీసివేయగలమా? ఎందుకు ఈ దుస్థితి! దేశంలోని ప్రజలందరికి అన్నం పండించి పెట్టే రైతులు తమకు పట్టెడన్నంకోసం, తమ కుటుంబాల ఆకలిబాధలను తెలియజేయడంకోసం ఇలా రోడ్డెక్కుతున్నారంటే, ఇలా తమ ప్రాణాలను అర్పిస్తున్నారంటే అది జాతి సిగ్గు పడవలసిన పరిస్థితేకదా! అంటే ప్రజల ఓట్లతో అధికారాన్నందుకొన్న నేతలు ఆ ప్రజలను సిగ్గుతో తలదించుకొనేట్లు చేస్తున్నారంటే అంత కంటే సిగ్గుపడవలసిన విషయం ఇంకేముం టుంది! బురదలో దిగి, తమ జీవితాలను కన్నీటి వరదలోకి నెట్టివేస్తున్న రైతులు తమ గోడును వినిపించాలంటే రోడ్డెక్కవలసిన పరిస్థితి కనిపిస్తున్నపుడు అది సంక్షేమరాజ్యం అనిపించుకొంటుందా! సంవత్సరానికి సగటున 12వేలమంది రైతులు దేశంలో ఆత్మహత్యలు చేసుకొంటున్నట్లు జాతీయ క్రైమ్ రికార్డుల బ్యూరోచెబుతోంది. అంటే ప్రతినెలా వెయ్యిమంది రైతులు ప్రాణాలు కోల్పోతున్నారన్నమాట. ఎంత విచారకరం! ఏ రాజకీయ నాయకుడైనా ఆత్మహత్య చేసుకొం టున్నాడా? పోనీ ఏ ప్రభుత్వ ఉద్యోగి అయినా, ప్రైవేటు ఉద్యోగి అయినా అలా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారా? లేదు. ఎందుకంటే వారి జీవితాలకు, వారి కుటుంబాలకు అన్నిరకాల 'భద్రత'లు అడగ కుండానే వచ్చేస్తున్నాయి. వారికి ఎలాంటి సమస్య వచ్చినా వెంటనే సంబంధిత యాజమాన్యాలకో, లేక ప్రభుత్వం దృష్టికో తీసుకువెళ్లి పరిష్కారం కనుగొనడానికి ప్రయత్నించే యూనియన్లు ఉంటాయి. వారు వాటిని ఏదోవిధంగా భయపెట్టో, బతిమాలో పరిష్కరించు కొంటూనే ఉంటారు. కానీ రైతులకే ఏదిక్కూలేదు. ఇంతకాలం వారు పండుగ చేసుకొంటున్నారో, పస్తులుంటున్నారో పట్టించుకొనే నాథులే కరువయ్యారు. అందుకే వాళ్లు కూడా ఇప్పుడు రోడ్డెక్కుతున్నారు. నాయకులను ప్రశ్నిస్తున్నారు.



'మా ఓట్ల నుంచి డబ్బులు పిండుకొనే మీరు విలాసాలు అనుభవి స్తుంటే మేం మాత్రం ఉరికొయ్యలపై వేలాడుతూండాలా? అని ఎలుగెత్తి అడుగుతున్నారు. నాయకులు జవాబు చెప్పవలసిన సమయం వచ్చింది. పార్లమెంటుకు కూతవేటు దూరంలో ఆమధ్య ఒక రైతు పట్టపగలు చెట్టుకు ఉరివేసుకొంటే..అప్పటిదాకా రైతుల వెతలే ఎరగనట్లున్న 'ప్రజాప్రతినిధులు' ఇక ఈ దేశంలో రైతు ఆత్మహత్య చేసుకొనే పరిస్థితి రానివ్వబోమంటూ ప్రగల్భాలు పలికా రు. కానీ ఆ తర్వాతైనా రైతు ఆత్మహత్యలు ఆగాయా? లేనేలేదు. ఆ నాయకుల మాటలే నిజమై ఉంటే ఇవాళ మధ్యప్రదేశ్‌లోని మాంద సౌర్ జిల్లాలో నడిరోడ్డుపై ఆరుగురు రైతులు తూటాలకు బలి కావలసిన పరిస్థితి ఎందుకు ఏర్పడుతుంది? ఎప్పుడూ ఎక్కడా విననివిధంగా మహారాష్ట్రలో రైతులు 'సమ్మె' చేయవలసిన దుస్థితి ఎందుకు తలెత్తుతుం ది? ఢిల్లీలో నడిరోడ్డుపై ఆందోళన చేస్తున్న రైతులు తమ మూత్రం తాగి దప్పిక తీర్చుకోవలసిన దుర్భర పరిస్థితి ఎందుకు ఏర్పడుతుంది? రైతే మారాజు, రైతే మా బాస్ అని మీడియాలో ప్రకటనలు చేస్తున్న ఏ ముఖ్యమంత్రి వాటికి జవాబివ్వగలరు?

నిజమే. రైతులు ప్రస్తుతం చాలా శోచనీయమైన పరిస్థితిలో ఉన్నారు. పంటలు పండినా, పండకపోయినా వారికి ఒకే రకమైన దుస్థితి. నెలయ్యేసరికి వారి చేతుల్లో ఎలాంటి ఆదాయమూ పడదు. ఇంక్రిమెంట్లు, ప్రమోషన్లు అంటే వారికి అర్థాలే తెలియవు. తాము వేసే ఓటు ఎంతమందిని ఎంత సంపన్నులను చేస్తుందో అసలే తెలియదు. వారికి తెలిసిందల్లా ఒక్కటే. ఎండలోను, వానలోను, చలిలోను ఒకేవిధంగా కష్టించి పనిచేయడం. వ్యాపారులు, దళారులు నకిలీ విత్తనాలు, నకిలీ ఎరువులతో తమను ముంచేస్తున్నారని తెలిసినా పెదవి విప్పలేని పరిస్థితి. అష్టకష్టాలు పడుతూ ఎంతో కొంత పండించినా దానిని ఎలా, ఎక్కడ అమ్ముకోవాలో తెలియక అయినకాడికి దళారుల చేతుల్లోపెట్టి తలవంచుకు వెళ్లిపోయే దుస్థితి. ప్రభుత్వాలు చెప్పే మాటల్లో, చేసే ప్రకటనల్లో రైతులకు ఎన్నో సౌక ర్యాలు కనిపిస్తుంటాయి. మీడియాలో ఆ ప్రకటనలు చూస్తూంటే 'ఈ దేశంలో రైతుకంటే అదృష్టవంతుడెవరు?' అని తప్పక అనుకోవలసి వస్తుంది కూడా. కానీ వాస్తవం వేరు. నిజంగా ప్రభుత్వాలు, అధికార నేతలు చెప్పేవన్నీ నిజమైతే మళ్లీ వేసుకోవలసిన ప్రశ్న అదే.. ఇంతమంది రైతులు ఎందుకు ఆత్మహత్యలు చేసుకొంటున్నారు .. ఎందుకు వారంతా రోడ్డున పడుతున్నారు? అని.

********

ఇవాళ రైతులోకం అశాంతితో రగిలిపోతోంది. దాని నేపథ్యం ఒకటి రెండు రోజులది కాదు. దేశానికి స్వాతంత్య్రం వచ్చిన తర్వాత గత ఏడు దశాబ్దాలుగా పేరుకుపోతూ వచ్చినదే. ప్రభుత్వాలు ఎప్పటికప్పుడు తీసుకొనే కంటితుడుపు చర్యలతో తాత్కాలిక ఉపశమనం కలిగితే కలగవచ్చుగాని దానివల్ల దేశంలో ఒక్క రైతుకూడా నవ్వుతూ బతకలేకపోతున్నాడు. ఏ ఒక్క రాష్ట్రంలోను రైతులు ఇప్పుడు సంతోషంగా లేరు, సంతృప్తిగా లేరు. తమిళనాడు, మహా రాష్ట్రాల్లో కొద్ది నెలల క్రితం మొదలైన ఆందోళనలు అన్ని రాష్ట్రాలకు విస్తరిస్తు న్నాయి. కొన్ని రాష్ట్రాలలో అమలు చేస్తున్న రైతు రుణమాఫీ వారికి వరమో కాదోగాని మరింత పెనుభారం మోపుతోంది. మధ్యప్రదేశ్‌తో పాటు రాజస్థాన్, పంజాబ్ రైతులు కూడా రగిలిపోతున్నారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణలో రోజూ ఏదో ఒకచోట నుంచి రైతు ఆత్మహత్యలు వినబడుతూనే ఉన్నాయి.

అటువంటప్పుడు రైతులకోసం ప్రభుత్వాలు కేటాయిస్తున్నట్లుగా ప్రకటిస్తున్న వేల కోట్ల రూపాయలు ఏ కలుగులోకి చేరిపోతున్నా యనే సందేహం కూడా తలెత్తుతుంది. ప్రతిపక్షాలు కూడా రైతుల ఆందోళనలను, సమస్యలను ఏదోవిధంగా 'సొమ్ము' చేసుకొనడానికే ప్రయత్నిస్తున్నాయిగాని నిజంగా వారివైపు నిలిచి పోరాడేవారే కరవయ్యారు. ఇక్కడ గమనించవలసిన విషయం ఒకటి ఉంది. దేశమంతా వర్షాలు బాగా కురుస్తున్నాయి, పంటలూ బాగానే పండుతున్నాయి. గత సంవత్సరం ఆశించినదానికంటె దిగుబడి అనేక రెట్లు పెరిగినట్లు ప్రభుత్వ గణాంకాలే చెబుతున్నాయి. అయినా రైతులు అలమటిస్తూనే ఉన్నారంటే.. ఎక్కడో ఏదో లోపం ఉన్నదనే కదా అర్థం. రైతులకు ఉచితంగా కరెంటు ఇస్తున్నా మంటున్నారు, రుణమాఫీలు చేస్తున్నామంటున్నారు, సబ్సిడీపై ఎరువులు, విత్తనాలు సరఫరా చేస్తున్నామంటున్నారు, ఇంకాస్త ముందుకు వెళ్లి ధాన్యం సేకరణ ఎంతైనా చేస్తామనీ, రైతు లోగిళ్లలో వెన్నెల కురిపిస్తామనీ వరాలిస్తున్నారు. కానీ రైతుల దుస్థితే మారడం లేదు. అంటే ఏదో లోపం ఉన్నదని అద్దంలో ప్రతిబింబంలా కనిపిస్తున్నది కదా!

ఆ లోపమేమిటో నేతలకు స్పష్టంగా తెలుసు. తెలియనిదల్లా పాపం రైతులకే. అందుకే వారు మళ్లీ మళ్లీ రోడ్డెక్కుతున్నారు, మళ్లీ మళ్లీ ఉరితాళ్లు మెడకు చుట్టుకొంటున్నారు. ఉదారణకు పోలీసు కాల్పుల్లో ఆరుగురు రైతులు మరణించిన మధ్యప్రదేశ్‌నే తీసుకుంటే, అక్కడి చౌహాన్ ప్రభుత్వం ఏం ప్రకటించిందో, చివరికి ఏం జరిగిందో అర్థమవుతుంది. గోధుమ దిగుబడి వెల్లువెత్తడంతో గత సంవత్సరం అక్కడి ప్రభుత్వం పంటల మార్పిడిని ప్రోత్సహించింది. దానితో రైతులంతా ఉల్లిసాగువైపు మళ్లారు. ఉల్లి కూడా విరగపండింది. అయితే ధర పడిపోయింది. అప్పుడే రైతులు అక్కడ ఆందోళన బాట పట్టారు. వారి ఒత్తిడితో శివరాజ్‌సింగ్ చౌహాన్ తొలిసారిగా ఉల్లికి కూడా మద్దతు ధర ప్రకటించారు.

ఈ సంవత్సరం కూడా ఉల్లి ఉత్పత్తి బాగా పెరగడంతో ప్రభుత్వం దానికి తాగినట్లుగా మద్దతు ధరను ప్రకటించి సేకరణ జరపలేకపోయింది. దానితో గత నెల రోజులుగా రైతులు పెద్ద ఎత్తున ఆందోళనలు ప్రారంభించారు. పండిన పంటకు గిట్టుబాటు ధర లేకపోతే, ప్రభుత్వం దానిని కొనుగోలు చేయలేకపోతే రైతులు ఇక ఏం చేయగలుగుతారు? సీజన్ అంతా వదిలివేసి, చివరలో సేకరణకు ఆదేశాలిస్తే దానివల్ల రైతుల కంటె దళారులకే ప్రయోజనం ఎక్కువగా ఉంటుంది. ఆ దళారు లెవరు? ప్రజా ప్రతినిధులుగా ముసుగు వేసుకొన్న కొందరు దోపిడీదారులే. ఇక రైతులకు న్యాయం ఎలా జరుగుతుంది? పోలీసులు కాల్పులు జరపవలసిన అవసరం సృష్టించింది ఆ నాయకులే. రైతుల ఉత్పత్తులకు సరైన మద్దతుధర ప్రకటించి, సకాలంలో సేకరణ జరిపి ఉంటే రైతులు పొలాలకు వెళ్లడం మానేసి రోడ్డెక్కుతారా? అంటే వారికి ఆ అవసరం కల్పిస్తున్నది అధికార పెద్దలే అనే విషయం స్పష్టమవుతున్నది కదా! కొంచెం ఆలోచిస్తే అసలు లోపమెక్కడుంతో అర్థమవుతున్నది కదా!

రుణమాఫీ వెనుక కూడా అటువంటి లోగుట్టే ఉంది. ఈ పథకాన్ని కొన్ని రాష్ట్రాలు ప్రస్తుతం ఎంతో ఆర్భాటంగా అమలు చేస్తున్నాయి గాని దానివల్ల రైతులకు నిజంగా కలుగుతున్న ప్రయోజనం అత్యల్పమే. మహారాష్ట్ర 30 వేల కోట్లు, ఉత్తరప్రదేశ్ 36,359 కోట్లు, తమిళనాడు 5,482 కోట్లు, తెలంగాణ 17 వేల కోట్లు, ఆంధ్రప్రదేశ్ 24 వేల కోట్లు రుణమాఫీ ప్రకటించాయి. రైతుల ఒత్తిడి తట్టుకోలేక మరికొన్ని రాష్ట్రాలు కూడా అదే బాట పట్టనున్నట్లు ప్రకటిస్తున్నాయి.

రైతులకు నిజంగా ప్రయోజనం కలిగించేదే అయితే అది ఏ చర్య అయినా హర్షణీయమే. కానీ రుణమాఫీ పేరుతో ఆయా ప్రభుత్వాలు కేటాయిస్తున్న నిధులు నిజమైన లబ్ధిదారులకు గాక అధికార పార్టీలకు మద్దతిచ్చేవారికే అధిక శాతం అందుతున్నా యనే ఆరోపణలు ఎక్కువగా వినిపిస్తున్నాయి. అంతేగాక ప్రభుత్వం మంజూరు చేసే మొత్తంతో రైతుల రుణాలపై వడ్డీ కూడా తీరడం లేదనీ, అసలు రుణం అలాగే ఉండడంతో బ్యాంకర్లు కొత్త రుణాలు మంజూరు చేయడం లేదనీ వినిపిస్తోంది.

అటువంట ప్పుడు అన్ని వేల కోట్లు ప్రభుత్వాలు ఆ పథకం కింద కేటాయించడంవల్ల ప్రయోజనం ఏముంటుంది? ఏదైనా ఉంటే అధికార పార్టీకి మద్దతిచ్చే ఏ కొద్దిమందికే కదా! రైతు సంక్షేమమంటే ఇది కాదు కదా! అందుకే ఆ రైతులు తిరిగి రోడ్డెక్కవలసిన అగత్యం ఏర్పడుతున్నదనిపిస్తుంది.

ఒక అంచనా ప్రకారం 2019 ఎన్నికల నాటికి వివిధ రాష్ట్రాలలో 2,57,000 కోట్ల రూపాయల రుణమాఫీ కింద వెచ్చించే అవకాశా లున్నట్లు తెలుస్తోంది. అంత భారీ మొత్తాన్ని రుణమాఫీకోసం గాక రైతుల పంటలను ప్రభుత్వం కొనుగోలు చేయడానికి వినియోగిస్తే ఎక్కువ ప్రయోజనం చేకూరే అవకాశం ఉంటుంది కదా! దళారుల జోక్యం లేకుండా రైతుల కళ్లాల నుంచే ప్రభుత్వం నేరుగా ఉత్పత్తులను కొనుగోలు చేస్తే వారికి ఎంత లాభం చేకూరుతుంది? అలా చేస్తే లాభం రైతులకేగాని దళారుల ముసుగులోని రాజకీయ నాయకులకు కాదు. బహుశా అందుకే ఏ అధికార పార్టీ అలా చేయలేకపోతున్నదేమో!

తొలుత ఈ పరిస్థితిలో మార్పు రావాలి. రైతు సంక్షేమం నిజంగా కోరుకునే పార్టీ అధికారంలో ఉంటే ఈ పరిస్థితిలో తొలుత మార్పు తేవాలి. బడుగు రైతు కూడా అందరిలా అందంగా బతికే సదుపాయం సమాజంలో కలిగించాలి. ఎన్నెన్నో కమిటీలు వేస్తున్నా రు, బడ్జెట్లలో కోటానుకోట్లు కేటాయిస్తున్నారు. అది నిజమే. కానీ దానిలో 10 శాతం కూడా సద్వినియోగం కావడం లేదు. అదీ నిజమే. అందుకే రైతులు మళ్లీ మళ్లీ రోడ్డెక్కుతున్నారు.

మాందసౌర్ కాల్పుల ఘటన, దానిలో ఆరుగురు రైతులు ప్రాణాలు కోల్పోయిన సందర్భం మరోసారి తలెత్తకుండా ప్రభుత్వాలు వ్యవహరించినపుడే అందరికి అన్నం పెట్టే 'అన్నదాత'లు కూడా కాస్తంత అన్నం తినగలుగుతారు. రైతు బతుకులకు 'భద్రత' ఇవ్వలేని ప్రభుత్వాలు వారి బతుకులను బజారున పెట్టడం భావ్యం కాదు కదా! అధికార నేతలు తమ బాధ్యతను గుర్తెరగవలసి ఉంది.

# ఆరిపోయిన అక్షరదీపం




కవులు ఎందరో ఉండవచ్చు. కానీ సామాన్యుల నుంచి సాహిత్యాభిమానుల వరకు అసంఖ్యాకుల్ని తన కలం సేద్యంతో అలరించి, అభిమానధనాన్ని అంతులేనంతగా దోచుకున్న కవివరేణ్యుడు సి.నారాయణ రెడ్డి. తన అమేయ అక్షర శక్తితో తెలుగు భాషకే కమ్మదనాన్ని, నిండుదనాన్ని సంతరింపజేసిన సాహితీ దురంధరుడు సినారె. అలతి అలతి కావ్యాలల్లినా, మధురాతిమధురమైన సినీగీతాలందించినా, తెలుగులోనే తొలిసారిగా గజళ్లను వెలయించి.. గానంచేసినా, అనన్యసామాన్య భావగర్భిత కవితలల్లినా అది సినారెకే చెల్లింది. రూపులోను, వస్త్రధారణలోను అసలు సిసలు తెలుగువాడిగా ఆదర్శప్రాయంగా నిలిచి, భాగ్యనగరంలోను, ఇతరత్రా కూడా సాహితీ సభలకు ఓ ప్రత్యేక శోభను చేకూర్చిన సంస్కారాధునికుడు సినారె. 'విశ్వంభర' కావ్యంతో జ్ఞానపీఠ్‌ను సొంతంచేసుకొని తెలుగు వారి కీర్తి పతాకాన్ని దశదిశలా రెపరెపలాడించిన సినారె మరలి రాని లోకాలకు తరలి వెళ్లిన సందర్భంగా ఆయనకు నివాళిగా ఈ అక్షరాంజలి..

"రాస్తూ రాస్తూ పోతాను
సిరా ఇంకేవరకు
పోతూపోతూ రాస్తాను
వపువు వాడే వరకు"

-అంటూ కవిత్వమే శ్వాసగా జీవించిన మహోన్నత సాహితీమూర్తి, తెలుగుల జ్ఞానపీఠం, 'విశ్వంభర' కవి-డా.సి.నారాయణరెడ్డి వియత్తలానికి తరలిపోయాడు. కవికుల గురువు దివికేగాడు. నిత్యచైతన్య శీలిగా, నిరంతర సాహితీమూర్తిగా జీవించి, యువతకు సదా స్ఫూర్తి ప్రదాతగా నిలచిన కవి వతంసుడు నారాయణరెడ్డి. ఒక సందర్భంలో కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారన్నట్లు....



"ఆయన హృదయం 'నాగార్జున సాగరం'
ఆయన యశస్సు 'కర్పూర వసంతరాయలు'
ఆయన నీడ 'వెన్నెలవాడ'
ఆయన కవితా కుమారి 'అజంతా సుందరి'
ఆయన నివాసం 'మధ్య తరగతి మందహాసం'
ఆయన ఆవేదన 'మంటలూ మానవుడు'
ఆయన భావాలు 'అక్షరాల గవాక్షాలు"

తెలుగు భాషా సాహిత్యాలకు వైభవ ప్రాభవాలు కూర్చిన మహోదాత్తుడు సినారె. 'పాతకొత్తల మేలు కలయిక క్రొమ్మెఱుంగుల్ చిమ్మగా' అన్న గురజాడ వాక్కుకు నిదర్శనంగా సత్సంప్రదాయాన్ని విడువ, నవసమాజపు విప్లవాత్మక భావాల్ని వస్తువులో, కవిత్వ రచనా ఫణితిలో సంతరించుకుని పద్యాన్ని, గేయాన్ని, గజల్‌ని, వచన కవితను వాడిమితో, మేలిమితో పరిత్య లోకానికి అందించి ఖ్యాతిగాంచినవాడాయన.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య దివాకర్ల వంటి గురువుల వద్ద విద్య నేర్చి, ఆ గురువులను మించిన శేముషీ సంపన్నునిగా...వారిచేతనే ప్రశంసలందుకున్న ప్రతిభామతి సినారె'. పాఠం చెప్పి విద్యార్థిలోకాన్నీ, పాటలు రాసి ప్రేక్షక సమూహాన్నీ రంజింపచేసిన రససిద్ధుడాయన.

మాటలాడితివేని మందార కుసుమ ని
ష్యందమంద మరంద రసములొడు
కవిత చెప్పితివేని కల్హార మాలికో
ద్ధత సౌరభమ్ములు కడలుకొనును
గేయమల్లితివేని గాయనీ గాయక
గాత్ర సంతతికి సుత్కర్ష గూర్చు
చదువు చెప్పితివేని ఛాత్ర సంఘముల త
త్పరచిత్తములకు తాదాత్మ్యమొసగు

పావదూకోత్తముండవు, వర కవీంద్ర
సంతత శిరోమణివి, గురుసత్తముండవు
చిత్రగేయ విధాతవు, శిష్యవర్య!ః
ఖ్యాతి తెచ్చితివి మాకు విఖ్యాతుడవయి

అంటూ ఆచార్య దివాకర్ల వారు, సినారెపై, గురువైవుండీ కవిత నల్లారంటే సినారె వైశిష్ట్యం ఏమిటో విశదమవుతోంది. వందలాది మంది శిష్యులను తీర్చిదిద్దిన సినారె వేలాది సినీగీతాలను రాసి, లక్షలాది హృదయాలను దోచుకున్న అక్షర కోటీశ్వరుడు. ఎందరినో ప్రభావితమొనర్చి కవులుగా మలచినవాడు. ఆయన చేతులమీదుగానే తమ పుస్తకం ఆవిష్కృతం కావాలని ఆకాంక్షించిన కవులు,రచయితలు కొల్లలు. ఎందరికో కవిత్వ రచనకు స్ఫూర్తి ప్రదాతయై, ఎందరికో కవితా వస్తువుగా కూడా రూపెత్తినవాడు సినారె.

"కవిత్వమే తపస్సయి, కవిత్వమే శ్వాసై, కవిత్వమే ఊపిరై తనను తాను ఎవరూ సరికాని ఓ విలక్షణమైన గొంతుగా శిల్పించు కున్నవాడు అతను..

ఒకసారి గాలిలో తేలి ఒక పాటై వస్తాడు.
మరోసారి కాగితాల్ల అక్షరాలను చల్లుతూ కావ్యమై వస్తాడు

**ఇంకోసారి సాహిత్యామృతాన్ని నేలపై**
**విత్తనాలు విత్తనాలుగా చల్లుతూ ఋషై వస్తాడు.**
**అందరి గుండెల్లోకి పుస్తకాలు పుస్తకాలుగా విస్తరిస్తాడు.**
**అతనే..అసలును మించి పర్వతమై ఎదిగినదడ్డీ..సి.నారాయణరెడ్డి**
**తెలుగుపాటకు చిరునామా**
**తెలుగుతనానికి ఎనలేని ధీమా"**

అంటాడు కవి రామా చంద్రమౌళి. ఇలా కవులచే కీర్తించబడ్డ కవిశ్రేష్ఠుడు సినారె.



డా.సింగిరెడ్డి నారాయణ రెడ్డి కరీంనగర్ జిల్లా వేముల వాడ మండలం హనుమాజి పేట గ్రామంలో 29.7.1931 శ్రీమతి బుచ్చమ్మ-మల్లారెడ్డి దంపతులకు జన్మించారు. తొలుత వీధిబడిలో, ఆపై సిరిసిల్లలో ఉర్దూ మాధ్యమం లో మాధ్యమ కవిత్వం కరీంనగర్‌లోని ప్రభుత్వోన్నత పాఠశాలలో ఉన్నత విద్య నేర్చారు. ఏడవ తరగతిలో వుండగానే-

**"ఒకనాడు ఒక నక్క ఒక**
**అడవిలోపల**
**పొట్టకోసరమెటో పోవుచుండె"**

అంటూ ఛందస్సంటే తెలియని దశలోనే, సీసపద్య ఫణితిలో పద్యంరాసి, శ్రీదూపాటి వేంకట రమణాచార్యులగారి నుండి ఛందో మెలుకువలను గ్రహించారు. తొమ్మిదో తరగతిలో వుండగా..

**"మారుటెన్నడో**
**విషంపు గుండెలీ జగాన**
**మారుటెన్నడో"**

అంటూ తొలి గేయరచన చేశారు. ఉన్నత విద్య దశలో పాటలు, గేయాలు అల్లడం అలవోకగా మారింది.

**"వెన్నవంటి మనసున్నవానికి**
**అన్నమేమొ కరువాయె**
**ఉన్న వానికింతన్నమిడుదా**
**మన్న గుండెలేదాయె"**

అంటూ పదవ తరగతిలోనే సామాజిక స్పృహతో, ఆదర్శ భావజాలంతో కలం కదిలించారు.

నారాయణరెడ్డిగారు హైదరాబాద్ ఛాదర్‌ఘాట్ కళాశాలలో ఉర్దూ మీడియంలోనే ఇంటర్మీడియట్ పాసయ్యారు. అప్పుడే శ్రీ జువ్వాడి గౌతమరావుగారి సంపాదకత్వంలో వెలువడుతున్న 'జనశక్తి' పత్రికలో నారాయణరెడ్డిగారి తొట్టతొలి కవిత ప్రచురితమైంది. హైదరాబాద్‌లోని శ్రీకృష్ణ దేవరాయంధ్ర భాషా నిలయం గ్రంథాలయ సభ్యులైన సినారె-రాయప్రోలు, గురజాడ, కృష్ణశాస్త్రి, జాషువా, శ్రీశ్రీ, కరుణశ్రీ వంటివారి రచనలనూ, అనేక గ్రంథాలనూ చదివారు. ఉస్మానియా యూనివర్సిటీలో 1952లో ఉర్దూ మాధ్యమంలోనే బి.ఏ.పూర్తి చేశారు. ఆర్ట్స్ కళాశాల సాహితీ సంచిక 'శోభ'కు సి.నా.రె సంపాదకత్వం వహించి, అందులో 'రోచిస్', 'సింహేంద్ర' అన్న కలం పేర్లతోనూ రచనలు చేశారట! 1954లో ఎం.ఏ.తెలుగు చేసి, సికింద్రాబాద్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల, నిజాం కళాశాలల్లో ఉపన్యాసకులుగా పనిచేశారు. ఖండవల్లి వారి పర్యవేక్షణలో 'ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు' అనే అంశంపై 1962లో పి.హెచ్.డి. పట్టాను పొంది, 'డాక్టర్'-సి.నారాయణరెడ్డి అయ్యారు. ఒక సిద్ధాంత గ్రంథం జనాకర్షక గ్రంథంగా పఠనీయతను పొంది, నేటికీ సాహితీ విద్యార్థులకూ, సాహితీ ప్రియులకు ఆకరగ్రంథంగా ఉండడం సినారె సిద్ధాంతగ్రంథానికే చెల్లిందనాలి! 1963లో ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడర్ అయ్యారు. 1976లో ఆచార్యులై 1981 వరకూ బోధనచేశారు. ఎందరో శిష్య ప్రశిష్యులు ఆయన వద్ద రూపొందారు. సినారె 1981-1985లో అధికార భాషా సంఘం అధ్యక్షులుగా తెలుగు భాషా సేవచేశారు. ఆపై దేశంలోనే తొలి ఓపెన్ యూనివర్సిటీ అయిన డా.బి.ఆర్. అంబేద్కర్ యూనివర్సిటీకి ఉపాధ్యక్షులుగా 1985-1989లో విధులు నిర్వర్తించి, ఏభై ఏడు జిల్లా అధ్యయన కేంద్రాలతో, యాభైవేలకు పైగా విద్యార్థుల సంఖ్యతో అది విస్తరిల్లేలా చేశారు.

21.6.1989న ఆచార్య సి.నారాయణరెడ్డిగారు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ బాధ్యతలు చేపట్టి, 4.11.1992 వరకూ ఆ విశ్వవిద్యాలయ అభివృద్ధికి కృషి చేశారు. యు.జి.సి. గుర్తింపు లభించింది. నూతన భవన నిర్మాణం కూడా ఆయన హయాంలోనే జరిగింది. 5.11.1992న సినారె భాషా సాంస్కృతిక వ్యవహారాల ప్రభుత్వ సలహాదారుగా సమున్నత పదవి నధిష్టించారు. ఆపై 1997 జూలై నుండి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులై-12.7.2004 వరకు కేబినెట్ హోదాలో ఎనలేని కళాసేవచేశారు. సాంస్కృతిక మండలి అధ్యక్షులుగా ఉన్న కాలంలోనే భారత రాష్ట్రపతిచే రాజ్యసభ సభ్యులుగా కొనసాగారు. దక్షిణభారత దేశపు కవి రాజ్యసభ సభ్యుడైన వైశిష్ట్యం సి.నా.రెకే దక్కింది. కేటాయింపబడిన ఎం.పి. నిధులను, కళా సాహిత్యరంగాలకు సముచితంగా ఖర్చుచేసిందాయనే!

1953లో 'నవ్వని పువ్వు'తో మొదలుపెట్టి, ఎనభైకి పైగా గ్రంథాలను తన 85 ఏళ్ల జీవితకాల పరిమితిలో వెలయించిన కవి, రచయిత సినారె. తన పుట్టిన రోజును తన నూత్న కావ్య సంకలన ప్రచురణతో జరుపుకున్న కవి బహుశా ఏటేటా ఆయనేనేమో! పద్దెనిమిది క్రియలలో ఆయన తన గ్రంథాలను వెలువరించారు. 'మంటలు-మానవుడు'కు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, 'విశ్వంభర' కావ్యానికి అత్యున్నత జ్ఞానపీఠ పురస్కారాన్ని అందుకున్న శేముషీ సంపద ఆయనది.




1976లో మీరట్ విశ్వవిద్యాలయ గౌరవ డాక్టరేట్, 1978లో ఆంధ్ర విశ్వవిద్యాలం 'కళాప్రపూర్ణ', అలాగే నాగార్జున, కాకతీయ, డా.బి.ఆర్. అంబేద్కర్ విశ్వవిద్యాలయాల గౌరవ డాక్టరేట్లు ఆయన్ను వరించాయి. భారత ప్రభుత్వం పద్మశ్రీ, పద్మభూషణ్ బిరుదులతో సత్కరించింది. అమెరికా, ఇంగ్లాండ్, ఫ్రాన్సు, జపాన్, రష్యా, కెనడా, ఇటలీ, డెన్మార్క్, థాయిలాండ్, యుగోస్లేవియా, గల్ఫ్ దేశాలు, ఆస్ట్రేలియా, సింగపూర్, మలేషియా, మారిషస్ దేశాలను పర్యటించి కవిగా తెలుగు బావుటాను ఎగురవేసిన అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన తెలుగుకవి సినారె! ఆయన గ్రంథాలపై ఎందరో పరిశోధనలు చేసి ఎం.ఫిల్, పిహెచ్.డి. పట్టాలను సంపాదించుకున్నారు. సినారె వ్యక్తిత్వ సాహిత్యాలపై వెలువడిన గ్రంథాలు కూడా తక్కువేమీకాదు.. ఇవన్నీ వారి బహుముఖీన ప్రతిభకూ, మహిత వ్యక్తిత్వానికీ దర్పణాలు!

1962లో శ్రీనందమూరి తారకరామారావుగారి ఆహ్వానంపై చలనచిత్ర జగత్తులోకి అడుగిడిన 'సినారె'- గులేబకావళికథలో 'నన్ను దోచుకొందువటే వన్నెల దొరసాని' అంటూ తొలి సినీ గీతం రాసి,

తదాదిగా మూడువేలకు పైగా పాటలు రచించిన సినీకవిగా ప్రేక్షక హృదయాలను దోచుకున్నారు. 'గులేబకావళి కథ' సినిమా నుండి ఇటీవలి కాలపు కాలపు ప్రేమించు, అరుంధతి, మేస్త్రి సినిమాల వరకు- సాహితీవిలువలు గుబాళించే పాటలెన్నింటినో రచించిన సినీగేయకవి సినారె. 'పాటలో ఏముంది, నా మాటలో ఏముంది' పేరిట..తమ సినిమా పాటలకు చెందిన అనేక విషయాలను వివరిస్తూ, రెండు వ్యాఖ్యాన గ్రంథాలు కూడా వెలువరించారాయన. 'ఏకవీర', 'అక్బర్ సలీం అనార్కలీ' చిత్రాలకు పాటలేకాక, చలనచిత్ర సంభాషణలు కూడా సంతరించారు. మూగజీవులు, శభాష్ పాపన్న, మొగుడా పెళ్లామా, తూర్పుపడమర వంటి సినిమా లలో కావ్య సంబంధ పాత్రలలో వెండితెరపై కనిపించారు కూడాను. తెలుగు గజళ్లను స్వయంగా పాడి రికార్డులుగా వెలువరించారు.



**"ఎన్నో తెన్నుల కైతకన్నె విహరించినను పాటలోనే నాదు ప్రాణాలు గలవందు"** అని సూటిగా పలికి, 'పల్లె నాకు పాటనిచ్చింది. పట్నం నాకు మాట ఇచ్చింది' అని చెప్పుకున్నారాయన. జానపదం మూలకందంగా ఎదిగి, జ్ఞానపథంలో అడుగిడి, 'జ్ఞానపీఠం' కైవసం చేసుకున్న సాహితీ కృషీవలుడు సి.నారాయణరెడ్డి.

ఆకాశవాణిలో లలితగీత రచయితగా అడుగిడి,గేయనాటికలు, సంగీత రూపకాలు రచించిన కవిగా, అసంఖ్యాక శ్రోతల ప్రశంస లందుకున్నారు సి.నారాయణరెడ్డి. 'నేను ఆకాశవాణిలోనే పుట్టాను- కవిగా' అని రాజ్యసభలో గర్వంగా ప్రకటించిన కవి ఆయన.

ఎందరో యువకవులను వెన్నుతట్టి ప్రోత్సహించి, వారిలోని ప్రతిభను ప్రశంసించి, వారికి సాహితీ లోకంలో ఒక గుర్తింపు కలిగే స్థాయికి ఎదిగేలా చేసినవారాయన. ఆయన దగ్గర చదువుకున్న శిష్యులే ఆయన అనంతరం విశ్వవిద్యాలయ ఆచార్యులుగా, వైస్ ఛాన్సలర్స్‌గా రాణించిన వారున్నారు. దేశవిదేశాలనెన్నింటినో తన సాహితీ సుగంధాలతో పరిమళభరితం చేసిన సినారె- జంటనగరాల సాహితీ సాంస్కృతిక సంస్థలకెన్నింటికో పెద్ద దిక్కు! ప్రతిరోజూ సాయంకాలం.. ఒక్కరోజు రెండు,మూడు సభల్లో కూడా ముఖ్య అతిథిగా వేదికలెక్కి పాల్గొని, ప్రేక్షక జనాకర్షక సాహితీమూర్తిగా, వక్తగా రాణకెక్కినవారు నారాయణరెడ్డిగారు. స్వయంగా తన భార్య కీ.శే. సుశీలగారి పేరిట సుశీలా నారాయణ రెడ్డి అవార్డుతో రచయిత్రులను సత్కరిస్తూ వచ్చారు. యువభారతి, వంశీ, కిన్నెర, రసమయి, యువ కళా వాహిని, అభినందన వంటి ఎన్నెన్నో సంస్థలూ, రవీంద్రభారతి, త్యాగరాయ గానసభ వేదికలూ ఆయనతో పులకితమూ, పునీతమూ అయ్యాయి!



సినారెతో సుధామ

1943లో హైదరాబాద్‌లో స్థాపించిన ఆంధ్ర సారస్వత పరిషత్తుకు నారాయణరెడ్డిగారితో అయిదు దశాబ్దాలపైగా అనుబంధం ఉంది. శ్రీదేవులపల్లి రామానుజరావుగారు కాలధర్మం చెందాక- ఆయన రాసిన వీలునామా ననుసరించే, 27.6.1993న డా.సి. నారాయణ రెడ్డిగారు ఆ సంస్థకు అధ్యక్షులయ్యారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన అనంతరం- 'ఆంధ్ర సారస్వత పరిషత్' పేరు, 'తెలంగాణ సారస్వత పరిషత్'గా మార్పుచెందింది. 'పరిణతవాణి' పేర వయోధికులైన ప్రముఖుల ప్రసంగాలను పరిషత్ ఏర్పాటుచేసి, వాటిని గ్రంథస్థం చేసింది. 5.3.2010 నాడు 'పరిణతవాణి' స్వర్ణోత్సవ ప్రసంగాన్ని స్వయంగా సి.నా.రె. కావించి, తమ జీవిత సాహిత్య విశేషాలను సభానురంజకంగా విశదంచేశారు. తెలంగాణ సారస్వత పరిషత్ అధ్యక్షులుగానే ఆయన కన్నుమూశారు.

ఆయనతో గడిపిన క్షణాలు ఎవరికైనా మధురానుభూతులే! ఈ అక్షర నివాళినందిస్తున్న మీ సుధామ ఆయన 'ఋతుచక్రం' కావ్య సంకలనాన్ని తన తండ్రిగారి నుండి పదవ తరగతిలో పుట్టినరోజు బహుమతిగా అందుకుని, అలా కవిత్వ రచనా స్ఫూర్తినీ అందుకున్నట్లయిం ది. యువభారతి సంస్థ తన సభ్యులు నలుగురి కవితా సంకలనం 'వీచికలు' వెలువరించినప్పుడు సి.నా.రె దానిని ఆవిష్కరించి, ఆ సంకలనంలో తన కవిత్వమే కాక పుస్తక ముఖచిత్రాన్ని కూడా సంతరించిన సుధామను.. కవితలో బొమ్మ గీస్తాడు, బొమ్మలో కవిత రాస్తాడు' అని ప్రశంసిం చారు. అలాగే యువమిత్ర లిఖిత మాస పత్రిక సుమారు 8ఏళ్లు సుధామ సంపాదకత్వంలో వెలువడింది. 18.,1.74న సి.నారాయణరెడ్డిగారు ఆ పత్రిక గూర్చి "నేటి ముద్రిత పత్రికలు ముఖం చూసుకో దగ్గ అద్దం ఈ లిఖిత పత్రిక. ఇందులో ఉన్నవన్నీ చిత్రశబ్దాలు, శబ్దచిత్రాలు..శేముషి+కృషి= సుధామ అని ప్రశంసించారు. స్వహస్తాలతో సంచికలో లిఖించారు.

ఇక ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎంఏ (తెలుగు), ఎంఫిల్. పరిశోధనా పాఠాలను శిష్యునిగా స్వయంగా నారాయణరెడ్డిగారి నుండి నేర్చుకోవడం, ఆయన 'మంటలు-మానవుడు' కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు వచ్చిన సందర్భంగా డా.జి.వి. సుబ్రహ్మణ్యంగారు నిర్వహించిన సెమినార్‌లో "మంటలు-మానవుడు" కావ్యంలో "ఇమేజరీ"పై ప్రసంగించడం, ఆ తర్వాత ఉస్మానియాలో ఎం.ఫిల్ పరిశోధనకు 'తెలుగు అభ్యుదయ కవిత్వంలో (ఇమేజరీ) భావచిత్రాలు' అనే అంశాన్నే ఎన్నుకుని సుధామ ఎం.ఫిల్ పట్టాపొందడం ఓ ఆనంద స్మృతి వీచికయే! అలాగే 1990 లో నా 'అగ్నిసుధ' కావ్యానికి కలహంసి అవార్డు ఆయన చేతుల మీదుగా అందు కోవడం జరిగింది. 2004లో సుధామ తెలుగు విశ్వ విద్యాలయం సాహితీ పురస్కారాన్ని కూడా సినారె సాన్నిధ్యం లోనే అందుకున్నాడు.

సి.నారాయణరెడ్డిగారు ముఖ్య అతిథిగా విచ్చేసిన పలు సాహితీ సభలకు వక్తగా, విశిష్ట అతిథిగావెళ్లి వేదికను పంచు కోవడమేకాక, పలు సభలకు అధ్యక్షత వహించిన మంచి జ్ఞాపకాలు నారాయణరెడ్డిగారితో వున్నాయి. ఆకాశవాణిలో కార్యక్రమ నిర్వహణాధికారిగా మీ సుధామ సి.నారాయణరెడ్డిగారి 'ఋతుచక్రం' కావ్యాన్ని వారి గళం లోనే మొత్తం రికార్డుచేయడం జరిగింది. జాతీయ కవిసమ్మేళనంలో ఏటేటా సి.నా.రె చేత వివిధ భాషా కవితలకు తెలుగు అనువాదాలు చేయించి, వారి గళంలో ప్రసారం చేసే సదవకాశమూ లభించింది. సినారె ప్రేమాదరాలను పొందగల్గిన వారి శ్రేణిలో వుండడం నిజంగా ఒక గొప్ప భాగ్యమే మరి!

85 వసంతాలు పూర్తిచేసుకుని, వచ్చేనెల జూలై 29కు 86 వసంతాలు పూర్తిచేసుకునే దశలో గత కొద్దిరోజులుగా అస్వస్థులై, డా.సి. నారాయణరెడ్డి 12.6.2017 సోమవారం ఉదయమే కేర్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ చివరి శ్వాస విడిచారు.

'భూగోళమంత మనిషి బొమ్మ' కనుమరుగయ్యింది. 'కలిసి నడిచే కలం'తో- 'జ్వాలగా జీవించాలని', 'రెక్కల సంతకాలు'తో 'సమూహం వైపు' నిలిచి, 'కవితనా చిరునామా' అంటూ, 'దూరాలను దూసు కొచ్చి', ఎందరెందరి హృదయాలకో దగ్గరై, అందరి మన్ననలను బడసిన కవి-'విశ్వం నాలో వున్నప్పుడు "మనిషిగా ప్రవహించాలని"

'దృక్పథం' కలిగి, 'ఆరోహణ' చేస్తూ, 'కాలం అంచుమీద' శాశ్వతంగాఅదృశ్యమయ్యాడు. 'విశ్వంభర' కవి వియన్మండలంచేరిపోయాడు.

"కవిత్వమంటే
కర్రుమొనలోంచి మట్టి పలికినట్టుండాలి
చెమట ఆవిరిలోంచి మబ్బుపట్టినటే ఉండాలి
వెయ్యి పిడికిళ్లు ఒక్క లయలో ఉరిమితే
అది నినాదం.
నగ్న నినాదంశబ్దచైతన్యాన్ని తొడుక్కుంటే
అది కవిత్వం"

అన్న మానవీయ మహోదాత్త కవివతంసుడు. నడక సంస్కృతిలాంటిదనీ, పరుగు నాగరికతలాంటిదనీ తలపోసి-

నడకనాతల్లి
పరుగు నా తండ్రి
సమత నా భాష



కవితనా శ్వాస

'నా వాదం సామ్యవేదం-కవిత్వం నా మాతృభాష' అని పలికిన తెలుగువారి వెలుగుకవి-యువకవుల దారి దీపం డా.సి.నారాయణరెడ్డి అస్తమయం, ఒక ఉజ్జ్వల సాహిత్య శకానికి ముగింపు వంటిదే.

వేనవేల ప్రాణాలను హరించి విసుగేసిందేమో మనిషిగా క్షణం జీవించాలని మరణానికి దాహం. దాహార్తి తీరిన మృత్యువు-సినారెను శాశ్వత పరిష్వంగంలోకి తీసుకుంది. కాలశిఖరం మీద విశ్వ చైతన్యాన్ని ముద్రించి కవి శాశ్వతంగా నిష్క్రమించాడు. ఆయనపేర అవార్డులు నెలకొల్పుకున్నా, ఆయన శిలా విగ్రహాలు స్థాపించుకున్నా, గుండెనిండుగా వుండిపోయే కవికి- అసలు నివాళి ఆయన ఆశించిన తెలుగు భాషా, సాహిత్య వికాసాలను పరివ్యాప్తం చేసుకోవడమే!

కవికుల గురువుకు, విశ్వంభరామూర్తికి బాధాతప్త హృదయంతో అశ్రునివాళులివి, అక్షర భాష్పాలివి!

# నేను 'మొగ్గ'గా ఉన్నప్పుడు..

వార్తలోని బాలల శీర్షిక మొగ్గ'లో, గతంలో పిల్లలతో తన బాల్యానుభవాలను పంచుకుంటూ సి.నా.రె. రాసిన ముచ్చట్లివి.

– సి. నారాయణరెడ్డి

మనుమలూ...! మనుమరాళ్ళకు...!

చాలా విచిత్ర పరిస్థితుల్లో నా ప్రాథమిక విద్య జరిగింది. అవి నిజాం ప్రభువు ఏలుతున్న రోజులు. నేను పుట్టిన హనుమాజీ పేట లో (కరీంనగర్ జిల్లా) సర్కారుబడిలేదు. వీధిబడి మాత్రమే ఉండేది. మా ఉపాధ్యాయుడు ఒక పంతులు. అక్కడ ఏం నేర్చుకున్నానో ఇప్పుడు అక్షరం కూడా గుర్తులేదు. ఒకటి మాత్రం గుర్తు. అలీఫ్... బే...పే...తే... అని ఉరుదూ అక్షరాలు నేర్చుకున్నాను. తెలుగు అంతంత మాత్రమే. మొదటి తరగతి నుంచి బి.ఎ వరకూ, ఉరుదూ మీడియం కాలమది. అటు తెలుగు మీడియం లేదు. ఇటు ఇంగ్లీషు మీడియం మాకు అందుబాటులో ఉండేది కాదు. చేరడానికి తాలుకా కేంద్రం సిరిసిల్లా వెళ్ళవలసి వచ్చింది. మా అమ్మ అందుకు అంగీక రించలేదు. "నూరెకరాల భూమి అరచేతిలో ఉన్నది నాయనా.. ఒక్కగానొక్క కొడుకువు ఈ ఆస్తినంతా ఎవరు చూసుకుంటారురా బాబు..."అని మా అమ్మ మొర. సిరిసిల్ల వెళ్ళడానికి వీల్లేదన్నది. అది మాతృశాసనం. నా మనసు లోలోన తిరగబడింది. ఎదురు చెప్పలేదు. ఏం చేయడం? కుమిలి పోతున్న పౌరషం ఆత్మహత్య యత్నానికి దారితీసింది. ఊరవతల పెద్దబావిలో గబాలున దూకేశాను. అప్పటికి నాకు ఈత రాదు. ఈత వచ్చి దూకితే ఆత్మహత్య జరుగదు కదా! సీరియస్‌గానే దూకాను. అది పసితనం కదా! పక్కన ఉన్న రైతు పిల్లవాడు అయ్యో...అయ్యో...అంటూ నన్ను రక్షించి ఒడ్డున చేర్చాడు. మా అమ్మానాన్నలకు ఆ విషయం తెలిసింది. ఇక లాభంలేదని చదువుకోసం పిల్లలతో సిరిసిల్లకు పంపారు.

అక్కడా ఓ చిక్కే ఎదురైంది. నాలుగో తరగతి ఉర్దూ మీడియం ప్రవేశ పరీక్షలో లెక్కలలో మార్కులు చాలా తక్కువగా వచ్చాయి. నాకు ప్రవేశార్హత లేదని నిరాకరించారు క్లాస్ టీచర్ అబ్దుల్ ఖాదర్. నాలుగో తరగతి తెలుగు మీడియం ప్రవేశం ఇస్తానన్నారు. నాలుగో తరగతి తెలుగు మీడియం అంటే ఉర్దూ మీడియం రెండో తరగతితో సమానం. అయ్యో! మళ్లీ రెండో తరగతేనా? అని విలవిలలాడాను. టీచర్‌ను బతిమిలాడాను. అసలు వీల్లేదని అన్నారు. అసలు గుట్టు ఆ తరువాత తెలిసింది. లంచగొండి అని. పల్లెటూళ్ళ నుంచి వచ్చే విద్యార్థుల నుంచి ఏదో వంక చెప్పి కనీసం ఒక గొర్రెపిల్లను కానుకగా పుచ్చుకునేవాడని. నాకు చిన్నప్పటి నుంచే లంచమంటే పరమ అసహ్యం. అతనికి లొంగలేదు. హెడ్మాస్టర్ గారి వద్దకు వెళ్లి నా పరిస్థితి విన్నవించుకున్నాను నా వాలకం చూసి జాలి కలిగింది. చివరకు నాకు నాలుగోతరగతి ఉర్దూ మీడియంలో ప్రవేశం దొరికింది.

ఇంతవరకు నేను చెప్పిన ఈ రెండు సంఘటనలు అపురూపమైనవి కావు. మామూలు మాతృభాషలో విద్యాబోధన లేని నాలాంటి వాళ్ళకు అంతకంటే విశేషాలు ఏముంటాయి?

సరే! మరి తెలుగులో తొలి ఒరవడి ఎలా కలిగినట్లు? చదివి కాదు..! విని. అప్పుడప్పుడు వేములవాడ నుంచి హరిదాసులు వచ్చి హరికథలు చెప్పేవారు. పిచ్చిగా వినేవాడిని. ఇంటికొచ్చి అభినయించే వాడిని. ఆ కీర్తనలలోని పంక్తులే నా నాలుకమీద నర్తించేవి. ఇప్పటికీ గుర్తు "రారా... రారా... గజాననా మారా సుందరాకారా గజననా" ఈ పల్లవిని గజ్జెలు కట్టుకోకుండానే ఆ హరికథకుడిని అనుకరిస్తూ గంతులు వేసేవాడిని. ఇంతకూ... మారా+కారా అంటే ఏమిటో అప్పుడు తెలియదు. మననం చేసుకుంటే తరువాత తెలిసింది. అది మార సుందరాకార అని. మన్మథుడి లాంటి అందమైన వికారం కలిగినవాడని. నాకు శాస్త్రీయ సంగీతం పాఠం నేర్పిన తొలిగురువు ఆ హరికథే. అప్పుడప్పుడు ఒగ్గుకథలు, జంగం కథలు, కాముని పున్నమి పాటలు, సింధు భాగవతుల ప్రదర్శనలు వింటూ, చూస్తూ ఉండే వాడిని. జానపద గీతాల లయరీతులను రకరకాల దరువులను నాకు ఒంట బట్టించిన మలి గురువులు అని, నా తెలుగు తరగతుల్లో చదువుకున్నదికాదని, ఇప్పుడర్థమైంది కదా!

పాటల సంగతి అలా ఉంచుదాం. ఇక పాఠాల సంగతి చూద్దాం. నా భావి జీవితంలో రెండు రెక్కలు పాట, పాఠం. కవిగా తొలి నాళ్ళలో గేయాలు, గేయనాటికలు రాశాను. ఆ తరువాత ఉస్మానియా యూనివర్సిటీలో అధ్యాపకుడిగా చేరి పి.యు.సి నుంచి పి.హెచ్.డి వరకు పాఠాలు చెప్పాను. అందుకే నా బాల్యంలోకి వెళితే... ఆ దశలోనే నేను పాఠాలు చెప్పిన సన్నివేశం చెబుతాను. మొక్కజొన్న చేలలో తిరుగుతూ ఆ మొక్కలనే విద్యార్థులుగా భావించుకుని అప్పటికప్పుడే పాఠాలు అల్లుకొని బోధిస్తూ ఉండేవాడిని. మా నాయనకేమో నేను బాగా చదువుకుని తాలూకా తహసీల్దారు కావాలని... మా అమ్మకేమో సిరిసిల్లతో చదువు ఆపేసి వ్యవసాయం చూసుకోవాలని మరి నాకేమో కవి కావాలని.. అధ్యాపకుడిని కావాలని ఎం.ఏ పూర్తి అయిన దశలోనే ఆలిండియా రేడియో హైదరాబాద్‌లో ప్రొడ్యూసర్ పదవికి ఆహ్వానం వచ్చింది. నేను సవినయంగా తిరస్కరించాను. నాఫేట్, నా రూట్ వేరు అని అప్పుడే నాకు తెలుసు. విద్యార్థిగా ఉన్నప్పుడే "పిల్లల్లారా రారండి, బిరబిరాన చేరండి... తోటపల్లి ఒడిలోపల ఆటలాడగ రండి" అంటూ పిల్లల కోసం గేయనాటికలు రాసిన నేను మొగ్గ"లుగా ఉన్న మీతో చెప్పుకోవడం ఎంతో ముచ్చటైన అనుభవం.

# ఒక ఊరు ..ఒక వాగు.. ఒక కవి..

# అనేక జ్ఞాపకాలు

డాక్టర్ సి.నారాయణరెడ్డి అనే ఒక 'ఫెనామినా' పుట్టకపోతే నేటి రాజన్న సిరిసిల్ల జిల్లాలోని హనుమాజిపేట అనే ఊరు తెలంగాణలోని అన్ని పల్లెటూర్ల మాదిరిగానే ఒక ఊరుగా మిగిలిపోయేది. ఆయన జన్మించిన ఆ ఊరు అటు తర్వాత తన పేరు మార్చుకుని 'నారాయణ రెడ్డి పేట'గా మారిపోయింది. బహుశా సాహిత్య చరిత్రలో ఒక కవికి దక్కిన అరుదైన గౌరవం ఇదే కావచ్చు. సినారెతో సంబంధం ఉన్న ప్రతి ఒక్కరికి ఆయన, ఆయన కవిత్వం, వ్యక్తిత్వం తెలుసు. నా మట్టుకు నేను 'మానేరు మా కళ్ళకు ముత్యాలపేరు' అంటూ సినారె తాను తొలినాళ్ళలో జలకాడుకున్న మానేరు గురించి రాసుకున్న మానేరు తీరం సిరిసిల్ల నుంచి వచ్చినవాణ్ణి.

నా పదిహేనేళ్ళ వయసు నుంచి సిరిసిల్ల వాసిగా, ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థిగా, సాహిత్య పరిశోధకునిగా వారిని చూస్తూ వస్తున్నాను. జ్ఞానపీఠ పురస్కారం అందుకున్న నాటినుంచి రాజ్యసభ సభ్యులుగా వందలాదిసార్లు సిరిసిల్లకు వచ్చినప్పుడు వారితో గడిపిన వాణ్ణి. అయితే తెలుగు దేశానికి తెలిసిన నారాయణ రెడ్డి ఒక కవి, సినీగేయకవి, రచయిత... పరిశోధకుడు... ఇంకా అనేకం... కానీ మాకు తెలిసిన మా 'నారాయణ రెడ్డి బాపు' నిలువెత్తు మానవతా మూర్తి. దేశం ప్రధాని మొదలుకుని దేశాధినేతల దాకా ఎందరో మహామహులతో గడిపిన సినారె అసలు రూపాన్ని చూడాలంటే ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా జనవరి 9-10 తేదీల్లో స్వగ్రామం హనుమాజీ పేట వెళ్ళినప్పుడే చూడాలి.

'పంచెకట్టు'లోన ప్రపంచాన మొనగాడిలా ఉండే సినారె అచ్చు తెలంగాణ రైతుబిడ్డలాగా లుంగీ కట్టుకుని, బనీను, పైన సెల్లాతో పెద్దబల్ల మీద కూచుని తన చిన్ననాటి దోస్తులతో... చుట్టాలతో ముచ్చట్లు పెడుతుంటే చూసే వాళ్ళకు అచ్చు ఆ పూరి 'బంగళా బుచ్చవ్వ దొర్సాని' కొడుకులాగే కనిపించేవారు. ఆయనే మహాకవి సినారె అంటే నమ్మకుండా ఉండేది. ఏది తప్పినా నిన్నటిదాకా కూడా ప్రతియేడు తన ఊరికి వెళ్ళిరావడం అనేది సినారెకు ఒక రిచార్జ్‌లాగా ఉండేది. తన బాల్యంలో చిన్ననాటి




సహచారులు ఆడెపు నారాయణ కవి, గూడూరి సీతారాం, కనపర్తి లక్ష్మయ్య, మిద్దె రాములు వంటి వారితో ఆడుకున్న తన



సిరిసిల్లలో నేతన్నలు వస్త్రంపై సినారె చిత్రాన్ని నేసి బహుకరించిన సందర్భం

ఊరి మూలవాగును... తొలినాళ్ళలో సిరిసిల్లలో విద్యార్థిగా ఉన్నప్పుడు జలకాలడుకున్న మానేరును చూడగానే చిన్నపిల్లవాడిలా మారిపోయేవాడు. తన ఊరి వంటకాలు ప్రత్యేకంగా చేయించుకుని తినేవాడు.

కవిగా మహోన్నత జ్ఞానపీఠాన్ని అధిష్ఠించినా తన ఊరిమట్టిని, అక్కడి మనుషుల్ని ఎన్నడూ మరిచిపోని 'మట్టిమనిషి సినారె. 'మా ఊరు మాట్లాడింది' లోని పొట్టచేత పట్టుకుని బొంబాయికి బతకపోయిన చేనేత కార్మికుడు సినారె ఇంటి ముందు, వెనక ఉన్నవాడే. చింతకాయ తొక్కు బువ్వ రుచి చూపించిన పసుల పోశవ్వ, గోగులు పూసే గోగులు కాసే ఓ లచ్చా గుమ్మడి లోని పల్లె స్త్రీ ఇవన్నీ సినారె మూలవాగు ముచ్చట్లే.

చాలామంది నా ఊరు నాకేమిచ్చింది, నా దేశం నాకేమిచ్చింది అనడం చూస్తుంటాం, కానీ ఊరంతా చిన్నబాపు అని పిలుచుకునే నారాయణ రెడ్డి తన ఊరుకు సి.నారాయణ రెడ్డి పేట అన్న తన పేరును ఇవ్వడమేకాక, తన ఇల్లును గ్రంథాలయానికి, పొలాన్ని ఓపెన్ ఎయిర్ థియేటర్‌కు, పాఠశాలకు, యువజన సంఘానికి ఇట్లా ఎన్నో అందించారు. ఇక వారి రాజ్యసభ ఎం.పి నిధుల విషయం చెప్పాల్సిన పనిలేదు. మా సిరిసిల్ల ప్రాంతంలో సినారె నిధులతో వేయని బోరు బావులు లేని ఊరే లేదనడం అతియోక్తికాదు. కోరుట్లలో అందె వెంకటరాజం ఆధ్వర్యంలో నడుస్తున్న భారతి సాహిత్య సమితి సమావేశ మందిరం, వేములవాడ, సిరిసిల్లలోని సినారె కళా మందిరాలు వారి నిధులతో నిర్మించినవే. ఎన్నో పాఠశాల భవనాలు, కమ్యూనిటి హాళ్ళు ఇలా సినారె హయాములో నిర్మితమయ్యాయి. ఇవి రాజ్యసభ సభ్యునిగా వారు చేసిన పనులైతే కవిగా వందలాది మంది యువకులకు ఆయన స్ఫూర్తి. ఈ వ్యాసకర్త కూడా అలా సినారె నడిచివచ్చినబాటను చూసిఎర్ర బస్సెక్కి పట్నానికి వచ్చిన వాడే.

ఇప్పటికీ సినారె అన్న మూడక్షరాలు మా మానేరులో గొప్ప చేతనను, చైతన్యాన్ని రగిలిస్తుంటాయి. కారణం నమస్కరిస్తాను.

నమ్మిన నిజానికి కట్టుబడ్డ ఇజానికి
దొడ్డిదారి సంభావనలతో
దొరతనం వెలిగిపోతుంటే
కళ్ళలోకి సూటిగా చూసి
కాండ్రించి ఉమ్మేసే నిజానికి అన్న సినారె
వ్యక్తిత్వం..మూర్తిమత్వం..బాపూ..అల్‌విదా..

-డా.పత్తిపాక మోహన్
తెలుగు సంపాదకుడు,
నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా.

# కృతి

## మానవీయ విలువల సమాహారం



'ది బర్డ్స్ ఆఫ్ సేమ్ ఫెదర్ ఫ్లాక్ టుగెదర్' అన్న చందంగా సహృదయులెప్పుడూ సజ్జన సాంగత్యమే కోరుకుంటారు. ఆ కలయికకు కులం, మతం, అంత స్థువంటివి అడ్డురావు. ఆ సహృదయ సాంగత్యం లోని సంస్పందనలను, స్ఫూర్తిదాయక అంశాలను ఆస్వాదిస్తారు, ఆచరిస్తారు, పదుగురితో పంచుకుంటారు. సహృదయుడైన హర్షవర్ధన్ ఆ పనే చేస్తున్నారు. తన జీవన గమనంలో ఎదురైన స్ఫూర్తిదాయకవ్యక్తులతో నెరపిన సాంగత్యంలోని మధురిమల్ని మనతో పంచుకొంటున్నారు. కొన్నిటిని గమనిద్దాం.. ఈ సమాజం మనకు ఎంతో స్ఫూర్తినిచ్చింది. మనం సమాజానికి ఎంతో కొంత తిరిగి యివ్వాలి' అంటూ డా.ప్రభాకర్ పలకరిస్తారు. 'పరోపకారార్థ మిదం శరీరం' అన్నమాటకు నిలువెత్తు నిదర్శనంగా బాలసుబ్రహ్మణ్యం ఐఎఎస్ మనకు దర్శనమిస్తారు. 'పిల్లల భవిష్యత్తుకు తరగతి గదే పునాది' అనే సిద్ధాంతం మీద నడుస్తున్న పడాల చారిటబుల్ ట్రస్ట్, నీతినిజాయితీలకు మారుపేరైన మల్లికార్జునరావు, ఉన్నదాంట్లోనే సంతృప్తిపడే వాచ్‌మేన్ యేసులతో బాటు కళాతపస్వి విశ్వనాథ్, భరాగో, బాపు, ముళ్లపూడి వెంకటరమణ, యేసుదాస్ వంటి మహనీయుల సాంగత్యంలో తాను నేర్చుకున్న జీవితపాఠాలను రాశులుగా మనముందుంచారు. అందరూ చదవాల్సిన జీవితానుభవాలివి.

**(సహృదయ సాంగత్యం:హర్షవర్ధన్;వెల: రూ.100;ప్రతులకు: హర్షవర్ధన్, 203, చాముండేశ్వరి అపార్ట్‌మెంట్స్, సుందరనగర్, ప్లాట్‌నెం.24, హైదరాబాద్-500038)**

-రమణ వెలమకన్ని

## సార్థక కథా కదంబం..



జీవితమంటేనే నిరంతర భావోద్వేగ ప్రకటన. 'భావోద్వేగ కథలు' ట్యాగ్‌తో 'వొంతు' పేరిట ఓ కథా సంపుటిని వెలువరించారు జిల్లేళ్ల బాలాజీ. తొలి కథ 'బూబూ..'లో మాధవ్ పాత్ర సగటుభర్తకు ప్రతీక. పురిటికి వెళ్లిన భార్య బిడ్డతోపాటు మరో పాపను కూడా తీసుకురావడం, ఆ బిడ్డ తమవద్దే ఉంటుందని చెప్పడం అతడికి నచ్చదు. కానీ చివరకు బూబూ మాటలే అతనిలోని మానవీయతను మేల్కొల్పి, పాపను అక్కునచేర్చుకునేలా చేస్తాయి. గొప్పకథ. 'వొంతు' కథలో చంద్ర ఉద్యోగం దొరక్క, తరతరాలుగా తమదైన (గతంలో వద్దనుకున్న) గుడికొలువుకోసం సిన్నాయనను అడిగినా పిన్ని ఆడిన చావు నాటకంతో అది ఫలించదు. ఐనా ఆ తర్వాత సుస్తీగా ఉన్న పిన్నికి తానున్నానని అభయమిస్తాడు చంద్ర. ఆర్థికాన్ని అధిగమించిన ఆత్మీయత చక్కటి సందేశమిస్తుంది. కులవృత్తులను చిన్నచూపు చూడకూడదని రాచబాట, ఎర్రతివాచి చెపుతాయి. తీవ్ర వాదం గురించిన నలుగురిలో ఒకడు, చీకటినుండి వెలుగులోకి కథలు ఆలోచింపజేస్తాయి. 'సమీరా...ఓ సమీరా...' కథలో తాను బలైపోయినా సమాజానికి చీడపీడ వదలుస్తుంది సమీర. 'దృష్టి' కథలో తండ్రి క్రమశిక్షణ పేరిట కర్కశంగా ప్రవర్తించగా లహరి ఆత్మహత్య చేసుకుంటుంది. 'పరిరక్షణ' కథలో అరుణమణి, తన కుమార్తె ప్రేమపేరిట మోసపోకుండా తెలివిగా రక్షించుకుంటుంది. పాఠకులు చదివి తీరాల్సిన 'మేలై'న కథా కదంబమిది.

**(వొంతు (భావోద్వేగ కథలు): జిల్లేళ్ల బాలాజీ; వెల: రూ.120; ప్రతులకు: విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు)**

-జె.శ్యామల

## ఇవీ అందాయి..



యాత్రాదీపిక-7
మెదక్, పరిసర ఆలయాలు
పి.ఎస్.ఎమ్.లక్ష్మి
వెల:రూ.50
ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు

ఇంటికొచ్చిన వర్షం-కవిత్వం
పాలపర్తి ఇంద్రాణి
వెల:రూ.40
ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు





విజ్ఞానశాస్త్రం (బ్రహ్మ పురాణం)
డా.నిట్టల గోపాల కృష్ణ
వెల:రూ.40; ప్రతులకు:గోమాత సేవా ట్రస్ట్
202, శివసాయి సదన్, శ్రీనివాసపురం,
రామంతపురం, హైదరాబాద్.

గురుమూర్తి శతకము:
డా.వెలుదండ సత్యనారాయణ
వెల:రూ.25; ప్రతులకు: కపిలవాయి సంధ్య
అశోక్, ఇంటినెం.17-110, వాణిసదనం,
విద్యానగర్ కాలనీ, నాగర్‌కర్నూల్-509209.



## ప్రతిధ్వనించిన నిశ్శబ్దం..



నిశ్శబ్దం ప్రతిధ్వనిస్తుందా? అవును, నిశ్శబ్దమూ ధ్వనిస్తుంది. ఆ ధ్వని వినాలనుకుంటే యల్. రాజా గణేష్ కథా సంకలనం 'నిశ్శబ్ద ప్రతిధ్వని' చదవాల్సిందే. రచయిత సగటు మనిషి కావడం వల్ల కావచ్చు లేదా మధ్య తరగతి,కింది తరగతుల జీవితాలు ఆకట్టుకోవటం వల్లకావచ్చు వారిని నిశితంగా శోధించి, పరిశీలించి కథల్లోకి ఎక్కించారు. 'నెత్తిమీద కళ్లు'లో పనిమనిషి సీత, 'దేవతావృక్షం'లోని రాజీ, 'రెండు జన్మలు'లో దైవోపహతుడై హిజ్రాగా మారిన కమల్, 'నిముషం'లోని వీరాచారి, 'రోజు గడవని రాజు'లో గవర్రాజు, బుడబుక్కలరాజు (లింగరాజు కోట) ప్యూర్ గోల్డ్ కంపెనీవారు (జాతి చెట్టుకు వేరు పురుగులు), మోసంచేస్తే మతి భ్రమించిన తండ్రి..ఇలా వీళ్లందరూ సమాజంలో నిజాయితీగా బతకాలనుకుని విలువలు చంపుకోని ఆశోపహతులు..ప్రేమోపహతులు.. 'కెలిడియో స్కోప్'లో ఒక్కో వస్తువు అతి స్పష్టంగా కనిపించినట్లు అతి సహజంగా చిత్రీకరించారు. బతకాలంటే కాలంతో సమంగా పరుగెత్తాలని ప్రభోదించే ఒక్క 'పరాధీనం' కథ తప్ప మిగిలిన కథలన్నీ పాఠకులను మానవత్వపు లోతుల్లోకి తీసుకెళతాయి. కథ చివరి వాక్యాలు ఆలోచింపజేస్తాయి. ఎన్నుకున్న విషయాన్ని అతి వివరంగా చెప్పగలరని 'విముఖం' కథలోని స్వర్ణకారుల బతుకు తెలుపుతుంది. ఈ కథలు సహజ ఇతివృత్తాలు, బడుగుల జీవన చిత్రాలు.

**(నిశ్శబ్ద ప్రతిధ్వని-కథలసంపుట:యల్.రాజాగణేష్; వెల.రూ.60; ప్రతులకు: అన్నిపుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం




# 'అనునూచ' పుష్పం!

కస్తూరి మురళీకృష్ణ

'ఎడారిలో పూలు పూయటమా?'

ప్రతి సంవత్సరం ప్రపంచవ్యాప్తంగా పర్యాటకులు చిలీదేశంలో ఉత్తరాన ఉన్న కోపియాపో, క్విలిమారీ లోయ నడుమ ఉన్న ఎడారి ప్రాంతం చేరతారు.

మొక్క అన్నది లేని ఎడారి ప్రాంతం అది. ఆ ప్రాంతంలో తొలకరి చినుకు పడగానే అత్యద్భుతంగా నేలను తొలచుకుని పలు విభిన్నమైన రంగురంగుల పుష్పాల వృక్షాలు వెలికివస్తాయి. చూసేవారికి, ఒక్కసారిగా రంగుల విస్ఫోటనం జరిగిన భావన కలుగుతుంది. ఎటుచూసినా కన్నుల పండగచేస్తూ ఎరుపు వర్ణ పుష్పాలు కనిపిస్తాయి.

ఎడారి మొత్తం పుష్పవనంలా మారిపోతుంది. ఈ ప్రాంతాన్ని 'పూలు పూసే ఎడారి' అంటారు.

అయితే అక్కడికి పర్యాటకులు వచ్చేది కేవలం పూసే అందమైన రంగురంగుల పూలను చూడటం కోసమేకాదు, ఆ విరబూసిన పుష్పాల ద్వారా అంటే ప్రేమ సందేశాన్ని అందుకోవటం కోసం వస్తారు.

విరబూసిన సుందరమైన ఆ పుష్పాలలో ప్రతిబింబిస్తున్న అందమైన ప్రేమ గాథను తలచుకోవటం కోసం వస్తారు.

మరణం లేని మధురమైన ప్రేమ భావనను అనుభవించేందుకు వస్తారు.

ఎందుకంటే అక్కడ విరబూసిన పూలను 'అనునూచ' అంటారు.

ఆ పూల వెనుక అత్యద్భుతమైన ప్రేమగాథ ఉంది.

'అనునూచ' అనే అందమైన యువతి అమరమైన ప్రేమగాథ ఉంది. ఆ పూలన్నీ వీచే గాలితోపాటు 'అనునూచ' తన ప్రియుడికోసం ఎదురుచూస్తూ పుష్పంగా మారిపోయిన గాథను చెప్తూనే ఉంటాయి.

*********

లిమరీ నది గలగలలు వింటూ తన్మయత్వం చెందుతోంది అనునూచ. పరుగిడుతున్న నీటిలో ఎగసిపడే చీర. అలల శృంగాలపై నృత్యం చేస్తున్న సూర్య కిరణాల కన్యల తళతళలు చూస్తూ మైమరచిపోతోంది అనునూచ.

ఒకదానిపై ఒకటి దూకుతూ, ఒకదాని కింద నుంచి మరొకటి పారుతూ ప్రవహించే నీటిధారను చూస్తూ 'ఎంత అదృష్టవంతుడు ఆ ప్రియుడు, అతడిని కలవడం కోసం ఇంతవేగంగా పరుగిడుతోంది నది!' అనుకుంటోంది అనునూచ.

ఆమె కళ్లముందు నది ఓ అందమైన యువతిగా మారి, ప్రియుడిని కలవటం కోసం సర్వం మరచి పరుగెడుతున్న దృశ్యం కనిపిస్తోంది.

ఇంతలో ఆమె పక్కన అలికిడి అయింది.

అటువైపు చూడకుండానే అతడు వచ్చాడని గ్రహించింది అనునూచ.

ఆమె హృదయంలో మరుమల్లెలు విరిసిన భావన కలిగింది. ఒక మధురమైన పరిమళం ఆమె మనసులో నిండిన భావన కలిగింది.

అతడు ఆమె దగ్గిరగా వచ్చి కూర్చున్నాడు.

అతడి నుంచి వీస్తున్న గాలి తరగ ప్రేమ మీగడను మోస్తూ తెస్తున్న భావన కలిగిందామెకు.

ఆమె అతడివైపు చూడలేదు. కానీ అతడు తనవైపే చూస్తున్నాడని ఆమెకు తెలుస్తోంది. అతడి చూపు తన శరీరంపై పడుతూన్నది తెలుస్తోంది. వర్షపునీరు భూమిని తాకగానే భూమి పులకరించినట్టు మొలకలు వేసినట్టు, అతడి చూపు తాకుతూన్న ఆమె శరీరం పులకాంకితమౌతోంది.



అయితే భూమి ఉపరితలంపై వాన నీరు భూమి లోలోతుల్లోకి చొచ్చుకు పోయి భూగర్భంలో నీటి ఊటను ఏర్పాటుచేసినట్టు, అతడి చూపు ద్వారా అతడి ఆత్మ ఆమె శరీరాన్ని దాటి ఆమె మనసును తాకి, ఆత్మను స్పందింప చేస్తున్నట్టుంది.

అతడు చేయిసాచాడు. ఆమె ఆవైపు చూడ లేదు. కానీ అతడు చేయి సాచాడని గ్రహించింది.

నెమ్మదిగా, ఆకాశంలో తేలియాడే మేఘం గాలికి కదలుతూ, వయ్యారంగా తనవైపే వస్తున్న మరో మేఘంతో సున్నితంగా కలసినట్టు ఆమె చేయి అతడి చేయిని తాకింది.

కానీ ఒక మేఘం, మరో మేఘాన్ని తాకటంతోటే మెరపు మెరిసినట్టు, ఆమె చేయి అతడి చేయిని తాకగానే ఇరువురి మనస్సులలో విద్యుల్లతలు తటిల్లుమన్నాయి. హృదయ లోలోతుల్లో జనించి మేఘగర్జనలు వారి శరీరాలను కుదిపివేశాయి.

ప్రియుడి స్పర్శానంద సంజనిత సౌఖ్య భావన వల్ల కలిగిన మైమరపుతో మత్తునిండిన కళ్లతో ఆమె అతడి వైపు చూసింది.

ఆమె సౌఖ్య భావనకు హృదయంలో ఉన్న ఆనందమేదో కరగి నీరైనట్టు ఆమె కళ్లల్లో ముత్యాల్లాంటి నీటి బిందువులు తళుక్కు మన్నాయి.

తనలో కలుగుతున్న సంచలనాన్ని అదుపులో పెట్టుకుంటూ అన్నాడతడు. ఏదో ఒకటి మాట్లాడకపోతే తాను తన్మయుడై తనను తాను మరచిపోయి అనుభూతిగా మిగిలిపోతాడన్న భయం కలిగిందతనికి. అత్యంత అద్భుతమైన ఆనందంలోనూ అంతర్లీనంగా తన అస్థిత్వాన్ని కాపాడుకోవాలన్న తపన వల్ల కలిగే భయం అది.

'నేను వెళ్తున్నాను' అతి కష్టంమీద అన్నాడతడు.

ఆమె మాట్లాడలేదు. కానీ నెమ్మదిగా అతడి చేయి వదిలివేసింది.

'నేను వెళ్లటం నీకు ఇష్టంలేదని తెలుసు. నన్ను వదలి నువ్వుండ లేవనీ, నిన్ను వదలి నేనుండలేననీ తెలుసు. కానీ..నా లక్ష్యం నెరవేరాలంటే నేను వెళ్లక తప్పదు'.

ఆమె మాట్లాడలేదు. ప్రవహించే నదిలో ప్రతిఫలిస్తున్న సూర్యకిరణాల వెలుగులను చూస్తూ కూర్చుంది.

'నాకు తెలుసు. ఈ ప్రాంతంలో నీ అంత అందగత్తె లేదని..నీ చుట్టూ, నిన్నుకోరి ఎంతోమంది యువకులు తిరుగుతున్నారనీ తెలుసు. కానీ నువ్వు అందరిమీద అయిష్టం చూపించి, నా అదృష్టం వల్ల నన్ను నీ సన్నిహితుడిగా భావిస్తున్నావనీ తెలుసు. నేను దేశ దిమ్మరిని. భూమిలోని బంగారం తవ్వి తీయటం నా పని. కానీ నా అదృష్టం ఏమిటో కానీ ఎక్కడ తవ్వినా మట్టి తప్పించి బంగారం దొరకటంలేదు. వెతుక్కుంటూ మీ ఊరు చేరాను. నిన్ను చూశాను. సర్వం మరచిపోయాను. ముఖ్యంగా నువ్వు నన్ను ఇష్టపడటంతో నేను వెతుకుతున్న బంగారం 'నువ్వే'నని ఇక్కడే ఉండిపోదామను కున్నాను. కానీ..

నీళ్లు నిండిన కళ్లతో అతడివైపు ప్రశ్నార్థకంగా చూసిందామె.

'నీ సాంగత్యంలో సర్వం మరచిపోయాను. నేను నేనన్న భావనను మరచిపోయాను. నేను వేరు, నువ్వు వేరు అన్న భావన కలగలేదు. ఇరువురం వేర్వేరు శరీరాల్లో ఉన్న ఒకే ప్రాణం, ఒకే ఆత్మ అనుకు న్నాను. నా జీవిత గమ్యం, లక్ష్యం సర్వం నువ్వే అనుకున్నాను. కానీ...మనం సుఖంగా ఉండాలంటే ధనం అవసరం. ప్రేమలో ఎల్లకాలం గడపలేం. నేను నిన్ను చూస్తూ, నువ్వు నన్ను చూస్తూ జీవితం గడపలేం. మనకు పిల్లలు పుడతారు. వాళ్లని పెంచాలి. మనకు బాధ్యతలున్నాయి. వాటిని నెరవేర్చాలి. ఇవన్నీ కావాలంటే ధనం కావాలి. జీవితంలో ప్రేమ ఒక్కటే కాదు. ఇవన్నీ కావాలి. ప్రేమ నిలవాలంటే కూడా ఇవన్నీ కావాలి. అందుకని మళ్లీ బంగారం కోసం బయలుదేరు తున్నాను. ఇక్కడికి దగ్గరలోనే బంగారం గనులున్నాయని అంటు న్నారు. వెళ్తాను. బంగారం సంపాదించు కొస్తాను. ఇద్దరం ఆ బంగారంతో హాయిగా ఉందాం. అందుకోసం నాకు ఇష్టం లేకున్నా నేను వెళ్లకతప్పదు. నేను అక్కడ ఉన్నా నా ప్రాణం ఇక్కడే నీతో ఉంటుంది. నా ఆత్మ నీ దగ్గరే ఉంటుంది...అయినా నాదంటూ వేరే ఆత్మ ఉంటేగా!' నవ్వాడతడు.

ఆమె అతడివైపు చూస్తూనే ఉంది. అతడి మాటలు వింటూంటే ఆమె మనస్సులో పలు విభిన్నమైన ఆలోచనలు అలల్లాగా ఎగసిపడతున్నాయి.

ఆమె ఎంతకీ మాట్లాకపోవటంతో అతడు మళ్లీ అన్నాడు.

'నన్ను క్షమించు. నేను నిన్ను కష్టపెడుతున్నానని తెలుసు. నేను నిన్ను బాధపెడుతున్నానని తెలుసు. నాకూ ఇది ఇష్టంలేదు. కానీ ఇది తప్పదు. నీలాంటి అందమైన, సున్నితమైన యువతిని నేను గుడిసెల్లో ఉంచనా? నువ్వు కఠినమైన పనులు చేస్తూంటే నేను చూడగలనా?; అది భావ్యమా?' అతడి కళ్లల్లో నీళ్లు నిలిచాయి.

ఆమె పెదవి విప్పింది.

'ప్రేమ అన్నది తనువుల కలయిక కాదు. హృదయాల కలయిక. ఆత్మల కలయిక. ప్రాణాల కలయిక. నీ ప్రాణం నా ప్రాణం ఒకటైపో యాయి. నీఆత్మ నా ఆత్మ ఒకటయిపోయాయి. కానీ..పురుషుల ప్రేమ, భావన, స్త్రీల ప్రేమ భావనలో తేడా ఉంటుంది. స్త్రీకి ప్రేమనే సర్వస్వం. స్త్రీ స్వభావంలోనే ఇది ఉంది. ఆమె ప్రపంచం మొత్తం ప్రేమే. ఆమె ఆ ప్రేమలో ఎలాంటి కష్టాన్నయినా భరిస్తుంది. ఎంతటి తుపానులనయినా ఎదుర్కొంటుంది. కానీ పురుషుడు ప్రేమ లోకంగా బతకలేడు. అలా బతికే వారు చాలా అరుదు. వారిలో స్త్రీ లక్షణం అధికంగా ఉంటుంది. అందుకే పురుషుడి ప్రేమ ఒక తీవ్రస్థాయికి చేరిన తరువాత బరువులు, బాధ్యతలు గర్తొస్తాయి. లక్ష్యాలు, గమ్యాలు గుర్తొస్తాయి. అప్పుడతడి ప్రేమ భావన రూపాంతరం చెందుతుంది. నిన్ను నేను అర్థంచేసుకోగలను. కానీ బంగారంవేట ఒక మృగతృష్ణ లాంటిది. ఎంత ధనం సంపాదించినా సరిపోదు. ధనం ఉంటే ప్రేమ నిలుస్తుందా? ప్రేమ ఉన్న చోట దాన్ని మించిన ధనం ఉందా? అన్నది మన దృక్కోణంమీద ఆధారపడి ఉంటుంది. నీ దృష్టి ధనం వల్ల ప్రేమ నిలుస్తుందన్నది. నా దృష్టిలో ప్రేమను మించిన ధనంలేదు. ఇది స్త్రీ పురుషుల దృష్టిలో మౌలికంగా ఉన్న తేడా. కానీ ఏ ప్రేమను నిలుపుకోవటానికి ధన సంపాదన అంటూ వెళ్తున్నావో, ఆ ధనం వేటలో ప్రేమకు దూరమౌతావేమో ఆలోచించు. ధనం ఉంటేనే ప్రేమ నిలుస్తుందన్న ఆలోచనలోనే ఉన్న లోపం గమనించు. నేను నీ దారికి అడ్డురాను. నీకోసం ఎదురు చూస్తూ ఉంటాను. నువ్వు తిరిగి వచ్చేవరకూ నీకోసం ఎదురు చూస్తూంటాను. నీ జ్ఞాపకాలలో బతుకుతుంటాను. మన ప్రేమపుష్పం వికసించి ఈ జగతిని ప్రేమ పుష్పవనంలా మార్చేందుకు ఎదురుచూస్తూంటాను. ఒకటి గుర్తుంచుకో. సౌఖ్యం కావాలి. ధనం అందించే సౌఖ్యాలు అవసరం లేదు. నువ్వు నా ప్రాణాన్ని, నా ఆత్మను నీ వెంట తీసుకువెళ్తున్నావు. నువ్వు వచ్చేవరకూ ఈ శరీరం నీకోసం ఎదురుచూస్తూంటుంది' అందామె.

ఆమె స్వరంలో విషాదం తొంగిచూసింది.

అతడు ఆమె చేతిని సున్నితంగా నొక్కి వదిలేశాడు.

'నేను తిరిగివస్తాను. బోలెడంత బంగారం తెస్తాను' అన్నాడు. లేచాడు.

ఆమె కదలలేదు. ప్రియుడిని కలవటం కోసం ప్రవహిస్తున్న నదిని చూస్తూ కూర్చుంది.

అతడు వెళ్లిపోయాడు.

ఆమె కదలలేదు.

సూర్యాస్తమయం అయింది.

సూర్యోదయమయింది. రోజులు వారా లయ్యాయి. వారాలు నెలలయ్యాయి. నెలలు సంవత్సరాలయ్యాయి. ఋతువు లు మారుతున్నాయి. కానీ ఆమెలో మార్పు రాలేదు. ఆమె అతడి కోసం ఎదురు చూస్తూనే ఉంది. అతడు రాలేదు. ఏమయ్యాడో తెలియదు.

పురుషుడు భ్రమరం లాంటివాడు. పువ్వునుంచి పువ్వుకు తేనెను వెతుకుతూ పోతాడు.

కానీ తేనెను భ్రమరానికి అందించిన పుష్పం అలానే అక్కడే నిలిచి ఉంటుంది, భ్రమరం మళ్లీ తన దగ్గరకు తిరిగి వస్తుందన్న ఆశతో. అలా ఎదురుచూస్తూ ఎదురుచూస్తూ పువ్వు వాడిపోతుంది. రాలిపో తుంది. మట్టిలో కలిసిపోతుంది. మళ్లీ మొక్కగా ఎదుగుతుంది. మొగ్గవుతుంది. పువ్వవుతుంది.

అతడికోసం ఎదురుచూస్తూ ఆమె కూడా రాలిపోయింది.

ఆ ఊరి ప్రజలంతా ఆమె మరణానికి దుఃఖించారు. ఆమె మరణించినప్పటినుండీ కురుస్తున్న ఎడతెగని వర్షం, ఆమె మరణానికి ప్రకృతి సైతం దుఃఖిస్తోందన్న భావన కలిగించింది.

ఆ వర్షంలోనే ఆమెను సమాధిచేశారు.

మరుసటిరోజు సూర్యుడు వచ్చాడు. సూర్యకిరణాలు సమాధిని తాకటంతోటే ఆ స్థలంలో ఆమె హృదయంలాంటి ఓ పూవు పూసింది .. ఆ పూసిన పూవు క్షణాలలో ఆ లోయ అంతా విస్తరించింది.

అది చూసిన వారందరికీ 'అనునూచ'.. ఆమె ప్రేమ గుర్తుకు వచ్చింది. ఆమె బాధ తెలుస్తోంది..

ఆమె జ్ఞాపకార్థం ఆ పుష్పాల్ని 'అనునూచ' అన్నారు ప్రజలు.

**********

ఇప్పటికీ వర్షం కురియగానే చిలీ ఎడారిలో 'అనునూచ పుష్పం' విరబూస్తుంది.

అమర ప్రేమకు అందమైన సంతకంలా నిలుస్తుంది.

## దారి చూపుతారా




## రంగులు వేయండి



పిల్లలూ! కుడివైపు ఇచ్చిన సూచనల ప్రకారం ఆయా అంకెలున్న చోట ఆయా రంగులు వేయండి.

# అందరి సొత్తు

కథ

గౌరవెల్లి గ్రామంలో శంకరయ్య కూలిపనులు చేసుకుంటూ జీవించేవాడు. అతడికి వారసత్వంగా రెండెకరాల భూమి వచ్చింది. కానీ నీళ్లు లేక బావులు ఎండిపోవటంతో వ్యవసాయంచేసేవాడు కాదు. చుట్టుపక్కల వాళ్లు బోర్లు వేసి, మోటర్లు బిగించి కరెంటు ద్వారా నీళ్లతో పంటలు పండించేవారు. అందరూ శంకరయ్యను బోరువేసుకొని వ్యవసాయం చేసుకోమన్నారు. శంకరయ్య తన సంపాదనలోనే కొద్దిగా డబ్బు దాచుకుంటూ చివరకు తన పొలంలో బోరు వేశాడు. బోరులో నీళ్లు బాగా పడ్డాయి. తనకు ఉన్న రెండెకరాల పొలంకు సరిపోగా, మిగిలిన నీటిని ఇరుగుపొరుగులకు అందిస్తూ వ్యవసాయం చెయ్యసాగాడు శంకరయ్య.



'మాకు నీళ్లిచ్చావు. మాకు పంటలు బాగా పండుతాయి కదా, నీళ్లిచ్చినందుకు డబ్బులు తీసుకో' అంటూ ఎందరు అడిగినా శంకరయ్య తీసుకునేవాడు కాదు. తన పొలానికి నీళ్లు పారించినట్లే, ఇతరుల పొలాలకు కూడా నీళ్లు పారించేవాడు.

అది గమనించి శంకరయ్య భార్య 'నీళ్లు ఇచ్చినందుకు బదులుగా వాళ్లంతా డబ్బులిస్తామంటే నువ్వు ఎందుకు తీసుకోవు?' అంటూ చాలాసార్లు కోపగించింది.

అప్పుడు శంకరయ్య భార్య కాంతమ్మతో 'పిచ్చిదానా! భూమిలోనుండి వచ్చిన నీళ్లు అందరి సొత్తు. మనకు సరిపోగా ఇతరులకు ఇస్తే తప్పేమిటి?' అనేవాడు.

'అయ్యో! ఎంత దయాగుణమో' అంటూ విసుక్కునేది ఆమె.

ఒకసారి శంకరయ్య పొలం కోతకు వచ్చింది. కరెంటు ఎక్కువగా వచ్చి శంకరయ్య బోరు మోటారు కాలిపోయింది. ఆరోజు ఆదివారం. మోటారును టౌనుకి తీసుకెళ్లాడు. దుకాణాలన్నీ మూసి ఉన్నాయి. దాంతో ఆరోజు పట్నంలోనే ఉండి, మరుసటిరోజు మోటార్ బాగు చేయించుకుని ఇంటికి వచ్చేసరికి రాత్రయింది. కోతకు వచ్చిన పంటకు రెండురోజులు నీళ్లు లేకుంటే పంటపండదని దుఃఖించాడు శంకరయ్య. కాంతమ్మ ఓదార్చింది.

మర్నాడు ఉదయమే బండి కట్టి మోటార్ తీసుకుని కాంతమ్మతో పొలానికెళ్లాడు శంకరయ్య. శంకరయ్య పొలందగ్గరకు వెళ్లేటప్పటికి ఇరుగుపొరుగులంతా కలిసి శంకరయ్య పొలానికి తమ పొలంనుంచి నీళ్లు పారిస్తున్నారు.

శంకరయ్య రాగానే బోరులో మోటారు దించి సాయపడ్డారు. 'భూమిలోని నీళ్లు అందరి సొత్తు శంకరయ్యా' అంటూ ఇరుగుపొరుగులు వెళ్లిపోయారు.

శంకరయ్య కాంతమ్మలు సంతోషించారు.

–ఉండ్రాల రాజేశం







# వార్త ఆదివారం

## రంగులు

బాలగీతం

నీలంరంగూ నీలంరంగూ
నువ్వెక్కడ?
అందని ఆకాశంలో నేనే
సముద్రపు నీటిలో నేనే
రాసే పెన్ను సిరాలో నేనే

ఆకుపచ్చరంగూ ఆకుపచ్చరంగూ
నువ్వెక్కడ?
చిలకమ్మ ఒంటిపై నేనే
బడి యూనిఫామ్‌లో నేనే
ప్రకృతి మొత్తమంతా నేనే

పసుపురంగూ! పసుపురంగూ
నువ్వెక్కడ?
పసుపు కొమ్ములో నేనే
పసిడి నగల్లో ఉన్నది నేనే
ముద్దబంతి పువ్వులో నేనే

ఎరుపురంగూ ఎరుపురంగూ
నువ్వెక్కడ?
ముద్దమందారంలో నేనే
మండే సూర్యుడిలో నేనే
మహిళ నుదుటిపై నేనే

తెలుపురంగూ తెలుపు రంగూ
నువ్వెక్కడ?
చందమామలో నేనే
చక్కని పాలలోనూ నేనే
చిన్నారుల మదిలో నేనే

నలుపురంగూ నలుపురంగూ
నీవెక్కడ?
చీకటిలో ఉన్నది నేనే
అమ్మాయి కురుల్లో నేనే
పాపాయి దిష్టి చుక్క నేనే

-కందేపి రాణీప్రసాద్

## హలో ఫ్రెండ్...



చిన్నారుల ప్రశ్నలకు
వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్
**గిరీష్ అంకుల్ సమాధానాలు**

**డి.భార్గవ్, నెల్లూరు.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. నాదొక సందేహం. సారవంతమైన భూములు బీడులుగా మారటానికి కారణమేమిటి? అలాగే బీడుభూములను తిరిగి సారవంతాలుగా చేయవచ్చా? దయచేసి వివరించండి.**

**జవాబు:** భార్గవ్! ఒక్కొక్కసారి వరదల వల్ల, బలమైన గాలులు వీచడంవల్ల నేల కోతకు గురికావచ్చు. కాలువ సాగు పద్ధతిలో లవణశాతం పెరిగి చౌడు భూములుగా మారవచ్చు లేదా ఖనిజాలను వెలికి తీసే గనుల వల్ల, లేదా వనాలను నాశనం చేయటం వల్ల సారవంతమైన నేలలు క్షీణించి బీడు భూములుగా మారుతుంటాయి. అయితే వీటిని తిరిగి సారవంతాలుగా రూపొందించవచ్చు. ఉదాహరణకు ఓపెన్ కాస్ట్ మైనింగ్ వలన ఏర్పడిన అగాధాలలోకి నీటిని పంపి, జలాశయాలుగా మార్చవచ్చు. ఆ నీటిని చేపల పెంపకానికి, వినోద కార్యక్రమాలకు లేదా వ్యవసాయానికి వినియోగించవచ్చు. బీడు భూముల పునరుద్ధరణకు భారత ప్రభుత్వం 1985లో నేషనల్ వేస్ట్ ల్యాండ్ డెవలప్‌మెంట్‌ను ఏర్పాటుచేసింది. ఈ సంస్థ బీడు భూములను పునరుద్ధరించేందుకు అనేక చర్యలు చేపట్టింది. నేల క్షీణతను అరికట్టడానికి అత్యధికంగా చెట్లను నాటడం, నీరు అవసరంలేని నిస్సారమైన నేలలో పెరిగే చెట్లను నాటడం, గడ్డి భూములను పెంచడం వంటి చర్యలు చేపట్టింది. తద్వారా ప్రతి సంవత్సరం 20 లక్షల హెక్టార్ల పైగా బీడు భూములు ఉత్పాదక శక్తిపొందే భూములుగా పునరుద్ధరించడం జరిగింది. 1992లో గ్రామీణాభివృద్ధి మంత్రిత్వశాఖకు బీడుభూముల పునరుద్ధరణ కార్యక్రమాన్ని బదిలీచేసింది. దేశంలోని అనేక స్వచ్ఛంద సంస్థలు సైతం బీడుభూములను దత్తత తీసుకొని చెట్లను నాటి సామాజిక వనాలను, అడవులను పెంచుతున్నాయి.

**కె.అనూష, హైదరాబాద్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. గ్రహానికి, చందమామకు ఏమిటి తేడా? దయచేసి చెప్పండి.**

**జవాబు:** అనూషా! చందమామకు, గ్రహానికి ప్రధానమైన తేడా ఒకటుంది. అది..గ్రహాలు నక్షత్రాల చుట్టూ తిరుగుతాయి. కానీ చంద్రుడు గ్రహం చుట్టూ తిరుగుతాడు. ఉదాహరణకు మన భూగోళం నక్షత్రమైన సూర్యుడు చుట్టూ తిరుగుతుంది. అందువల్ల భూమి గ్రహం. అయితే చంద్రుడు భూమి చుట్టూ తిరుగుతుంటాడు.



# పురాణాలలో పితాశ్రీలు

ప్రతి తండ్రి, బిడ్డలను తనను మించిన వారిని చేయాలనే కలలు కంటాడు. అందుకు అహరహం శ్రమిస్తాడు. గతంలో.. సంపాదించి ఆర్థిక వనరు ఏర్పరచడం వరకే పరిమితమైన నాన్న పాత్ర ఇప్పుడు అమ్మలా లాలించి, పాలించడం వరకు విస్తృతమైంది. ప్రేమించే నాన్నలే కాదు, కఠిన హృదయులైన తండ్రులుండటమూ పరిపాటే. ఇది ఇప్పుడే కాదు, పురాణకాలంలోనూ..మరి మన పురాణాలలో పితాశ్రీలను అవలోకిస్తే.. **జూన్ 18 ఫాదర్స్ డే సందర్భంగా ఆ కథనమే ఇక్కడ!**

జె.శ్యామల

## ఆదర్శ పితాశ్రీ..

పరమశివుడి కుమారులు గజాననుడు, కుమారస్వామి. శివుడికి ఇద్దరిపై పుత్రవాత్సల్యం ఉంది. గణాధిపత్యం ఎవరికి అప్పగించాలన్న విషయంలో పుత్రులిద్దరూ పోటీ పడతారు. గజాననుడు జ్యేష్ఠ పుత్రుడు. కానీ కుమారస్వామి, అన్నగారు మందగమనుడని, తాను శక్తిమంతుడనని, అందువల్ల గణాధిపత్యం తనకే ఇవ్వాలని పట్టుబట్టాడు. అందుకు తండ్రి మీ ఇద్దరికీ పోటీ పెడుతున్నాను. ముల్లోకాలలో గల నదులలో స్నానమాచరించి, ఎవరు ముందుగా నావద్దకు వస్తే వారికే 'గణాధిపత్యం' అని బదులిస్తాడు. ఇంకేముంది. కుమారస్వామి నెమలివాహనం ఎక్కి రయ్యిమని వెళ్లిపోయాడు. గజాననుడు విచారంతో తండ్రితో 'నా అసమర్థత తెలిసికూడా ఇటువంటి పోటీ పెట్టడం తగునా?' అని ప్రశ్నించాడు.



పరమశివుడు 'మరేం ఫర్వాలేదు, తల్లిదండ్రులకు ప్రదక్షిణంచేస్తే ముల్లోకాలలోని నదులలో స్నానం ఆచరించినట్లే అని ఉపాయం చెపుతాడు. వెంటనే గజాననుడు భక్తిపూర్వకంగా తల్లిదండ్రులకు ప్రదక్షిణంచేస్తాడు. కుమారస్వామి వచ్చేసరికి అన్నగారు అక్కడే ఉండటం కనిపిస్తుంది. దాంతో అన్నగారికే ఆధిపత్యం ఇవ్వమని కుమారస్వామి అంగీకారం తెలుపుతాడు. ఇంకేముంది సమస్య పరిష్కారం అయింది. కుమారస్వామికి సేనాధిపత్యం తర్వాత చేకూరింది. ఇలా బిడ్డలకు సమన్యాయం చేశాడు పరమశివుడు.



## పుత్రశోకంతో శ్రవణుడి తండ్రి..

అంధులు, వృద్ధులు అయిన తల్లిదండ్రుల్ని కావడిలో మోస్తూ, తిరుగుతూ, వారికి కావలసిన సపర్యలన్నీ చేస్తూ, ఆకలిదప్పులను తీరుస్తూ వారి సేవే పరమార్థంగా గడిపాడు శ్రవణుడు. అటువంటి శ్రవణకుమారుడు ఒకరోజున తల్లిదండ్రుల దప్పిక తీర్చడం కోసం మంచినీరు తేవడానికి నది వద్దకు వెళ్లాడు. అతడు పాత్రను నీటిలో ముంచే సమయంలోనే ఒక బాణం వేగంగా వచ్చి అతణ్ని మరణం పాలు చేసింది. తమ కుమారుడు మరణించాడని తెలిసి ఆ తల్లిదండ్రులు తీవ్ర వ్యధచెందారు. పుత్రశోకంతో వారు ఆ బాణాన్ని ప్రయోగించిన దశరథుని 'నీవు కూడా పుత్రశోకంతోనే మరణిస్తావని' శపించి, దుఃఖభారంతో మరణిస్తారు. నిజానికి నీటి శబ్దం విని, శబ్దవేధి విద్య తెలిసిన దశరథుడు అది ఏనుగు అనుకుని బాణం వదిలాడు. ఏమయితేనేం..పొరపాటు గ్రహపాటుగా పరిణమించింది.

## తన వరమే తనకు శాపమైన దశరథుడు..

దశరథ మహారాజు ప్రియ సుతుడు శ్రీరాముడు, కౌస్యల ముద్దుబిడ్డ.. ఆ మాటకొస్తే కైకేయకీ ఆ క్షణం వరకు ముద్దుబిడ్డ.. శ్రీరాముడి పట్టాభిషేక సన్నాహాల కోలాహలం, అంతటా సంతోషం వెల్లివిరిసిన వేళ...దాసి మందర దుర్బోధతో కైకేయ అలకగృహం చేరి, తనకిచ్చిన వరాలను ఆ సమయంలో తీర్చమంటూ దశరథుని నిలదీసింది. ఆ వరాలు.. భరతుడికి పట్టాభిషేకం, శ్రీరాముడికి పదునాలుగేళ్ల వనవాసం. పట్టాభిషేకం మాటపై చింతలేదు కానీ రాముడికి పదునాలుగేళ్ల వనవాసం అనేసరికి ఆ తండ్రి హృదయం తట్టుకోలేక పోయింది. ప్రియ కుమారుణ్ణి చూడకుండా ఉండలేని దశరథుడు, పదునాలుగేళ్లు విడిచి ఉండాలంటే, అందునా రాముణ్ని కారడవులకు పంపాలంటే ఆయన హృదయం తల్లడిల్లింది. ఎంత చెప్పినా కైకేయ వినకపోవటంతో ఆయన తీవ్రవ్యధకు లోనయ్యాడు. మూర్ఛపోయాడు. ఈలోగా రాముడు వచ్చి, జరిగింది తెలుసుకొని, తండ్రి మాట నిలబెట్టడమే తనయుడిగా తన కర్తవ్యమంటూ అడవులకు పయనమవుతాడు. సీత, లక్ష్మణుడు అనుసరిస్తారు. అయోధ్య ప్రజ శోకిస్తుండగా రాముడు వనవాసానికి వెళ్లిపోతాడు. ఆ తర్వాత ఐదురోజులకు దశరథుడు కన్నుమూస్తాడు. దశరథుడికి శ్రవణ కుమారుడి తల్లిదండ్రులిచ్చిన శాపం అలా నిజమవుతుంది.

## వలపు కైపులో తండ్రి..ఆజన్మ బ్రహ్మచరిగా భీష్ముడు...

శంతన మహారాజు కొడుకు దేవవ్రతుడు. తొలిగా శంతనుడు, గంగను వలచాడు. అయితే గంగ, శంతనుడి కోరికను మన్నించింది

కానీ తానేమి చేసినా ప్రశ్నించకూడదన్న షరతు విధించింది. ప్రశ్నించిన తక్షణం అతడిని విడిచి వెళ్లిపోతానని చెప్పింది. ఆ షరతుకు శంతనుడు అంగీకరించాడు. గంగ, శంతనులకు బిడ్డ పుట్టగానే గంగ ఆ బిడ్డను నదిలో పడవేసింది. శంతనుడు బాధపడ్డా మిన్నకుండిపోయాడు. అలా ఏడుసార్లు ఏడుగురు బిడ్డలను గంగ నీటిపాల్జేసింది. ఎనిమిదవసారి గంగ బిడ్డను నదిలో పడవేయ బోతుండగా శంతనుడు వారించాడు. అంతే..గంగ తన షరతును గుర్తుచేసిన ఈ బిడ్డను నీకు తర్వాత అప్పగిస్తాను, నేను మాత్రం వెళ్లిపోతున్నాను అంటూ అతణ్ణి విడిచి వెళ్లిపోతుంది. తర్వాత మాట ప్రకారం దేవవ్రతుణ్ని శంతనుడికి అప్పగిస్తుంది. శంతనుడు ఆ తర్వాత పడవలో విహరిస్తూ పడవ నడుపుతున్న బెస్తకన్య సత్యవతిపై మనసుపడతాడు. అయితే సత్యవతి తల్లిదండ్రులు, శంతనుడికి అప్పటికే పుత్రుడు ఉన్నాడు కాబట్టి, తమ కూతురుకి పుట్టే బిడ్డ రాజు కాలేడని, ఒకవేళ దేవవ్రతుడు రాజుకాకున్నా, అతడికి పుట్టే బిడ్డ అడ్డం కావచ్చని పెళ్లికి అభ్యంతర పెట్టడంతో దేవవ్రతుడు రాజ్యం సత్యవతి బిడ్డకే దక్కుతుందని, తండ్రికోసం తాను ఆజన్మ బ్రహ్మచారిగా ఉండి పోతానని భీష్మ ప్రతిజ్ఞచేసి భీష్ముడవుతాడు.



## కుమారుడి యవ్వనాన్ని బదులు తీసుకున్న తండ్రి...

యయాతి మామగారు శుక్రాచార్యుడు. యయాతి రహస్యంగా రెండో వివాహం చేసుకున్నాడని తెలిసి, శాశ్వతంగా వృద్ధుడవు కమ్మని శాపమిస్తాడు. యయాతి భయపడిపోయి, శాపావకాశం ఇవ్వమని ప్రాధేయపడతాడు. అందుకు శుక్రాచార్యుడు ఎవరైనా తమ యవ్వనాన్ని బదులుగా ఇచ్చే పక్షంలో అతడికి యవ్వనం సమకూరుతుందని అసాధ్యమైన విషయం చెపుతాడు. అయితే యయాతి కొడుకు పురూరవుడు తన యవ్వనాన్ని తండ్రికిచ్చి, తండ్రి వృద్ధాప్యాన్ని తాను తీసుకోవటానికి సిద్ధపడతాడు. దాంతో యయాతి యవ్వనాన్ని పొంది సుఖాల ననుభవిస్తాడు. మనిషి కోరికలకు అంతంలేదన్న సంగతి గ్రహించాక, తిరిగి కొడుకు వద్దకు వచ్చి అతడి యవ్వనాన్ని అతడికిచ్చేసి, తన వృద్ధాప్యాన్ని తాను తీసుకుంటాడు.



## పక్షపాత పితాశ్రీ ఉత్తానపాదుడు..

రాజు ఉత్తానపాదుడి కుమారుడు ధృవుడు. ఉత్తానపాదుడికి ఇద్దరు భార్యలు-సురుచి, సునితి. సురుచి కొడుకు ఉత్తముడు. సునుతికి ఇద్దరు కొడుకులు. వారిలో పెద్దవాడు ధృవుడు. ఉత్తానపాదుడికి సురుచి అన్నా, ఆమె కొడుకు ఉత్తముడన్నా అమిత ప్రేమ. ఆ కారణంతో సునితిని, ఆమె పిల్లల్ని నిర్లక్ష్యంచేసేవాడు. ఒకసారి ఉత్తముడు తండ్రి తొడపై కూర్చున్నాడు. అది చూసిన ధృవుడికి తాను కూడా తండ్రి ఒడిలో కూర్చోవాలనిపించింది. తండ్రిని సమీపించాడు. వెంటనే సురుచి 'నువ్వు అక్కడ కూర్చోవడానికి తగవు. అలా కూర్చోవా లనుకుంటే ముందు వెళ్లి తపస్సు చేసి ఆ అర్హతను సంపాదించుకోమంటూ పరుషంగా మాట్లాడింది.

దాంతో ధృవుడి లేతమనసు గాయపడి, ఏమైనా సరే తాను తపస్సుచేసి ఆమె చెప్పినట్లు అర్హత సంపాదించ వలసిందేననుకొని వెంటనే అడవికి వెళ్లి తపస్సు ఆరంభించాడు. నారదుడు వారించాలని ప్రయత్నించినా వినలేదు. ఒంటికాలిపై నిలిచి తీవ్ర తపస్సు కొనసాగించాడు. కొంతకాలానికి విష్ణువు ప్రత్యక్షమై కోరిన వరాన్నివ్వడంతో ధృవుడు సంతోషించి, తమ రాజ్యానికి తిరుగుముఖం పడతాడు. వరాలు పొంది తిరిగి వచ్చిన ధృవుడిని ఉత్తానపాదుడే కాదు, సురుచి కూడా ఎంతో గౌరవాదరాలతో స్వాగతిస్తారు.



## పాషాణ పితాశ్రీ హిరణ్యాకశిపుడు..

రాక్షసరాజు హిరణ్య కశిపుడికి తనయుడు ప్రహ్లాదుడు. ప్రహ్లాదుడు బాల్యం నుంచే నారాయణ మంత్రాన్ని జపిస్తూ విష్ణుభక్తుడవుతాడు. తండ్రి హిరణ్యకశిపుడికి అది కంటగింపు అవుతుంది. విష్ణువు రాక్షసవైరి అని, ఆయన ధ్యానాన్ని మానుకోమని నయాన, భయాన చెప్పిచూస్తాడు. చివరకు ఏనుగుల చేత తొక్కించడం, విషసర్పాలను ప్రయోగించడం, కాగే నూనెలో వేయడం, మంటల్లో వేయడం వంటి ఎన్నో క్రూర శిక్షలకు గురిచేస్తాడు. అయినా ప్రహ్లాదుడు విష్ణుభక్తి వీడడు. చివరకు ఏదీ నీ శ్రీహరి, ఈ స్తంభంలో చూపమని తండ్రి గద్దించేసరికి ప్రహ్లాదుడు శ్రీహరిని స్మరిస్తాడు. వెంటనే ఆ స్తంభం నుంచి నరసింహుడిగా శ్రీహరి ప్రత్యక్షమై హిరణకశిపుని సంహరిస్తాడు.



## తల్లిని చంపమని పుత్రుణ్ని ఆదేశించిన తండ్రి...

రుషి జమదగ్ని పుత్రుడు పరశురాముడు. తల్లి రేణుకాదేవి. ఆమె ఓరోజున నీటికై సరస్సుకు వెళ్లి, అక్కడ ఓ గంధర్వుడిని చూసి మోహంలో చిక్కుకుంటుంది. దాంతో ఆమె ఆశ్రమానికి తిరిగిరావటం ఆలస్యమవుతుంది. జమదగ్ని ఆమెను సంహరించమని కొడుకులను ఆజ్ఞాపిస్తాడు. ఎవరూ ఆయన ఆజ్ఞను పాటించరు. ఆయన పరశు రాముడిని అందరినీ సంహరించమని ఆజ్ఞాపిస్తాడు. అతడు ఆ ఆదేశాన్ని తు.చ.తప్పక పాటించి తల్లిని, సోదరు లను సంహరిస్తాడు. అందుకు సంత సించిన జమదగ్ని, పరశురాముణ్ణి వరంకోరుకోమంటాడు. పరశురాముడు తల్లిని, సోదరులను తిరిగి బతికించ మంటాడు. దాంతో వారందరూ తిరిగి సజీవులవుతారు. తండ్రి సంతోషం కోసమే పరశురాముడు క్షత్రియులంద రిని సంహరిస్తాడు. అలా పురాణాలలో ఎనలేని పితృభక్తికి తార్కాణాలెన్నో.

ఇక భారతంలో ధృతరాష్ట్రుడు మితిమీరిన పుత్రప్రేమతో, దుర్యోధనుడు ఎన్ని కుతంత్రాలకు పాల్పడినా, పాండవులను కష్టాల పాల్జేసినా, పాండవపత్నిని నిండుకొలువులో అవమానించినా హితం చెప్పి మంచిమార్గానికి మళ్లించకపోవడం తెలిసిందే.

ఇక పుత్రికల పట్ల ఎంతో వాత్సల్యాన్ని చూపిన తండ్రులూ మనకు పురాణాలలో దర్శనమిస్తారు. జనకుడు, సీత పట్ల చూపిన ప్రేమ, కణ్వ మహర్షి, శకుంతల పట్ల చూపిన ప్రేమ ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. కణ్వ మహర్షి అయితే శకుంతల అత్త గారింటికి వెళుతుంటే బాధ పడుతూ, యతి అయిన తానే ఇంతగా బాధపడుతుంటే లోకంలో తల్లిదండ్రులు తమ కుమార్తెలను అత్తవారిళ్లకు పంపేటప్పుడు దుఃఖించడంలో ఆశ్చర్యమేముంది అనుకుంటాడు.

**ఇలా ఎందరెందరో.. పితృదేవో భవ!**




# రేపటి ముఖచిత్రం

– వడలి రాధాకృష్ణ

"ఆయన చాదస్తం మరీ ఎక్కువయిపోతోంది!"

"ఎక్కువవడమా! బాగా ముదిరిపో తుంటేను!!"

"ఎప్పుడూ లేదు. ఇప్పుడు వెయ్యి రూపాయలు మనియార్డర్ చేశాడు"

"అదే పిచ్చి ముదరడమంటేను. ఫోన్‌లో చెబితే సరిపోతుంది. కానీ ముందు కార్డు రాసి పారేశాడు. ఆనక మనియార్డరు. కొడుక్కి డబ్బు పంపకకబోతే చెప్పిన పని చేయడనా ఆయనగారి ఉద్దేశం!"

"ఈసారి కారులో వస్తున్నామని ఎలా తెలిసింది ఆయనకు"

"తెలియడమేమిటి! నాన్న అని పొంగిపోయి మీరే ఆయన చెవిలో వేసి ఉంటారు!!"

"నాన్న అని నేను వేసి ఉంటానో... మావగారు అని ఒళ్లు తెలియక మీరే అనేసి ఉన్నారో!"

"ఎవరన్నా ఏమన్నా ఫోన్‌లో ఇవతలివారి మాటలు విన్పించే వయసా ఆయనది!"

"అక్కడే పక్కనున్న కాలువలో అడుగేశావ్! బ్రహ్మయ్యగారంటే ఏమనుకున్నావ్. ఒకవేళ అవసరమయిన మాటలు విన్పించకున్నా, తనకు కావాల్సిన వాటిని బాగానే పట్టించుకుంటాడు... అదృష్టవంతుడు"

"అన్ని విధాలా పెట్టి పుట్టినవాడు!"

"అయితే ఈసారి మనకు తప్పేటట్లు లేదు"

"పోనీలేవోయ్! ఆయనేదో ఆర్డరేశాడు. అక్కడికి ఎలాగూ ప్రయాణం పెట్టుకున్నాం. బుట్ట కట్టించి పారేస్తే వెనుక కారు డిక్కీ భరాయిస్తుంది. తర్వాత మోసుకెళ్లి ఆయన మంచం పక్కన దించేస్తే పెద్దాయన పొంగిపోతాడు".

"ఎలాగయినా తండ్రీ కొడుకులు ఒహటే! కాదన్నదెవరు!!"

"కొడుకులు ఎప్పుడూ పేరుకే. పెట్టిపోత లకు మాత్రం కోడళ్లు ఉండాల్సిందే! లోక విద్యలను కాదనడానికి వీలుకాదు!!

మహాత్మ మాటలు తులసికి నవ్వు తెప్పిస్తున్నాయి.

"తెచ్చి పారేయాలిరా అబ్బాయ్, అంటే తీసుకురామా? ఈమాత్రందానికి డబ్బు మనియార్డర్ చేయాలా ఏమిటి?"

"ఏమోలెండి! చేసినందుకయినా తీసుకెళ్లి పారేస్తే ఈ వేసవిలో మావగారు తన వారందరికి తృప్తిగా పంచిపెట్టుకుంటారు" తులసి మాటలు యదార్థంగా ఉన్నాయి. ఈతకోటకు రేపే ప్రయాణం.

ఈ మధ్య కాలంలో చెన్నై నుండి నాలుగయిదు సార్లు రైలుమీదే వెళ్లి వచ్చాడు. వెళ్లినప్పుడల్లా తమ దగ్గరకు వచ్చేయమని అమ్మా, నాన్నలను నిలదీస్తూనే ఉన్నాడు.

కాలు, చేయి ఆడినంతవరకూ ఇక్కడే ఉంటామని తెగేసి చెప్పాడు. అప్పుడప్పుడు స్వంత కారులో సరాసరి ఊరి ప్రయాణం మహాత్మకు ఎంతో సరదాగా ఉంటుంది. వెళ్లేటప్పుడు మధ్యలో నాన్న పని చేసిన కామరాజుగడ్డలో ఆగి అక్కడ ప్రసిద్ధమయిన బంగినపల్లి మామిడిపళ్లను ఖరీదు చేసి తండ్రికి కానుకగా తీసుకొని వెళ్లేవాడు.

బ్రహ్మయ్యగారు సర్వీసులో ఉన్నప్పుడు కామరాజుగడ్డలో చాల కాలం పని చేశారు. ఎక్కడ పని చేస్తే అక్కడి వాతావరణంతో ఎక్కువగా మమేకమయిపోయే ఆయన సహజంగానే ఆ ఊరిలో మమేకం కాగలిగారు.

ఆ ఊరు మామిడిపండ్లకు చాల ప్రసిద్ధి. బంగినపల్లి, చెరుకురసాలు అక్కడ విస్తారంగా పండుతూ ఉంటాయి. వాటికి రాష్ట్రవ్యాప్తంగా మంచి గిరాకీ ఉంది. అలానే ఇతర రాష్ట్రాలలో కూడ వాటికి మంచి పేరుంది.

బ్రహ్మయ్యగారు ఎప్పుడు తన ఊరుకు పనిమీద వెళ్లినా ఇక్కడ కామరాజుగడ్డలో మామిడిపళ్లు ఖరీదు చేసి అక్కడ ఈతకో టలో తన వారందరికీ పంచిపెట్టి వచ్చేవారు.

"నీకు ఈ చాదస్తం ఏమిటయ్యా! డబ్బులు తగలేసుకొని కాయలు కొనుక్కొచ్చి అక్కడివా ళ్లకు ఊరికెనే పంచిపెట్టడం... బాగుంది వరస!"

భార్య మాటల్ని ఆయన పట్టించుకొనే వాడు కాదు.

"అంతా మన ఊరివారే కదా... కామరాజుగడ్డ బంగినపల్లి, రసాలు ఇక్కడ దొరుకుతాయా చెప్పు. నాలుగు కాయలు ఇచ్చామనుకో నాలుగు కాలాలు మన గురించి చెప్పుకుంటారు వాళ్లు!"

"వాళ్లు చెప్పుకోడాని కేంలే! అయినా మిమ్మల్ని ఎవరూ మార్చలేరు" చెప్పాలంటే ఆయనకు ఆ ఊరిలో ఉద్యోగం చేసిన రోజుల్లో అదొక వ్యాపకంగా ఉండేది. పెద్ద అవసరం లేకపోయినా ఈ పనికోసం కావాలని వేరే పనులు పెట్టుకొని స్వంత ఊరు వెళ్లి వచ్చిన సందర్భాలు కోకొల్లలుగా ఉండేవి.

బ్రహ్మయ్యగారు చేస్తూన్న ఉద్యోగం నుండి రిటైరైపోయి అప్పుడే ఇరవై సంవత్సరాల యిపోయింది. ఒక్కగానొక్క కొడుకు మహాత్మ చక్కగా పై చదువులు చదువుకొని బాగానే స్థిరపడ్డాడు. ఇప్పుడు చెన్నైలో మంచి ఎగ్జిక్యూటివ్‌గా ఉద్యోగం చేసుకుంటున్నాడు.



"అమ్మా! మీరు ఓ నిర్ణయం తీసుకోవాల్సిన సమయం వచ్చేసింది. ఇక్కడ ఉన్న న్నాళ్లూ ఉన్నారు. సాగనప్పుడు ఇంకెంత కాలం ఇలా పల్లెటూరులో ఉంటారు చెప్పు!" నాన్న వినడం లేదని అమ్మను హెచ్చరిస్తూనే ఉన్నాడు.

"నాదేముందిరా చెప్పు! ఆయనో మొండిరకం. చెబితే వినే మనిషి కాదు' అంది. మహాత్మ ప్రతిసారీ అడిగి, అడిగేసరికి నోరు నొప్పి పుడుతోంది. కానీ వాళ్ల కదలిరావడం లేదు.

మనం బాధ్యతగా అడుగుతున్నాం. అత్తా, మావలు చెన్నైకి రానంటే చేసేది ఏముంది చెప్పండి! మనం చేస్తూన్న ఉద్యోగాలను వదులుకొని ఈ ముసలాళ్లకోసం ఇక్కడకు వచ్చి ఉండిపోలేం కదా! ఆ పెద్దాయన కూడ తెలుసుకోవాలి!" తులసి కూడ అప్పుడప్పుడు సణుక్కుంటూనే ఉంది.

ఎప్పుడయినా ఈతకోటకు వస్తున్నానని ఫోన్ చేస్తే మామిడికాయల సీజను అది అయి ఉంటే కామరాజు గడ్డలో ఆగి బుట్ట ఖరీదు చేసుకొని రమ్మని చటుక్కున ఆర్డరేస్తాడు. ఒక్కోసారి అది మహాత్మకు అసహనంగా ఉండేది.

"ఈసారి రైలులో వస్తున్నాను నాన్నా!" అనేవాడు.

"అయితే సరే. కారులో వస్తున్నావేమో అని అడిగాను. వదిలేయ్!" అని నొచ్చుకొనేవాడు.

ఎప్పుడూ డబ్బు అడగడు. దస్కం అడగడు. ఈ మామిడి సీజన్‌లో ఈతకోటలో కాయలు దొరుకుతాయి. కానీ ఆ పిచ్చి ఏమిటో! మామిడిపళ్లకోసం పలవరిస్తాడు. పోనీ ఆయన తింటాడా... లేక అక్కడ ఏదయినా చిన్న వ్యాపారం చేస్తున్నాడా అంటే ఏమీ లేదు.

ఓ బుట్ట కాయలు కొనుగోలు చేసి కారులో వేసుకొని తీసుకెళితే ఆయనకు ఆనందమే ఆనందం. మా అబ్బాయి వస్తూ తీసుకువచ్చాడంటూ ఊరిలోని వారందరికీ పేరు పేరునా చెప్పి పంచేవాడు.

చెప్పాలంటే ఈ మధ్యన మహాత్మ డిప్యుటేషన్ మీద కొంత కాలం ముంబాయిలో ఉండాల్సి రావడంతో ఈతకోటకు రావడం బాగా తగ్గిపోయింది. అటువంటిది చాల కాలం తర్వాత ఇప్పుడు చెన్నైకి తిరిగి వచ్చాక "రేపు వారంలో నిన్ను చూడ్డానికి వస్తున్నాను నాన్నా!" అంటూ ఫోన్ చేశాడు.

ఆ మాట విన్నంతనే వెయ్యి రూపాయల మనియార్డరు వచ్చేసింది. కామరాజుగడ్డ బంగినపల్లి మామిడిపళ్లు తీసుకురమ్మని ఆర్డరేశాడు.

మహాత్మకు కోపం రావడం లేదు. నాన్న పంపిన డబ్బు నవ్వు తెప్పిస్తోంది. గతంలో రెండు మూడు సార్లు అడిగాడు. అప్పుడు సీజన్ కాకపోవడంతోను, ప్రయాణం కాకపోవడంతోను కుదరలేదు.

"పోనీలెండి మావగారు అవికాక ఇంకేమి అడిగారు చెప్పండి".

కారు ప్రయాణం. కామరాజుగడ్డ వచ్చేసరికి రాత్రి రెండు గంటలయిపోయింది. తండ్రి గతంలో ఉద్యోగం చేసిన ఊరు. తనకు బాగా తెలిసిన ఊరు. అయినా అంతా వింతగా ఉంది. ఆ ప్రాంతమంతా నమ్మశక్యం కాకుండా పూర్తిగా మారిపోయింది.

ఇది అసలు ఆ ఊరేనా? లేక పరాయి ప్రాంతానికి వచ్చామా! వేసవి కాలంలో అర్ధరాత్రిపూట కూడా రోడ్లమీద మామిడిపళ్లు పెట్టి అమ్ముతారు. ఇప్పుడు ఆ జాడలేమీ అగుపించడం లేదు. చాలా వింతగా ఉంది. నమ్మశక్యంగా లేదు. తులసికయితే సరేసరి. ఏ పరాయి ప్రాంతానికో వెళ్లినట్లుంది. తాము ఈ ఊరు మీదుగా ప్రయాణం చేసి ఐదు సంవత్సరాలు దాటిపోయింది.

కావాలని వేకువజాము వరకు అక్కడే కారులో కాలక్షేపం చేశారు. తర్వాత విషయాన్ని వాకబు చేశాడు.

చాల ఆశ్చర్యంగా అన్పిస్తోంది. కామరాజు గడ్డలో మామిడిళ్లు మచ్చుకయినా కానరాక పోవడం.

"అవును సార్! ఈ ప్రాంతమంతా మన కొత్త రాజధాని పరిధిలోకి వెళ్లిపోయింది. దానితో చాల మంది సన్నకారు రైతుల భూములన్నీ ప్రభుత్వానికి అప్పగించాల్సి వచ్చింది. ఆ కారణంగానే ఇక్కడ రియల్ ఎస్టేట్ బాగా బూమ్ అందుకుంది.

ప్రతి సన్నకారు రైతు తనకున్న ఒకటి రెండు ఎకరాల మామిడి తోటల్ని, పచ్చగా ఉన్న ప్రాంతాల్ని ఒదులుకోక తప్పలేదు.

ఇప్పుడు మామిడితోటలు పూర్తిగా కూల్చివేయబడ్డాయి. ఎన్నో ఏళ్లుగా చక్కని ఫలసాయాన్ని అందిస్తూ ఎంతో మందికి ఆధారంగా నిల్చిన పచ్చని చెట్లు ప్రొక్లెయిన్లతో పీకివేయబడ్డాయి. చూస్తున్నారు కదా! వాటి స్థానంలో అనేక ఆకాశ హర్మ్యాలు లేచిపోతున్నాయి" ఆ ముసలాయన భావోద్వేగంతో చెప్పుకుపోతున్నాడు. అప్పుడు ఆయన గారి గొంతు తీవ్రంగా కంపించిపోతోంది.

"... ... ..."

"అవును సార్! ఉన్న కొద్దిపాటి భూముల్ని నమ్ముకొని, మామిడిసాగును నమ్ముకొని తరతరాలుగా ఇక్కడ బతుకుతూ వస్తూన్న వాళ్లం. ఇప్పుడు అంతా మారిపోతోంది. కాదంటే మా మాటల్ని విన్పించుకొనేవారు ఎవరున్నారు కనుక!"

మహాత్మకు నమ్మశక్యంగా లేదు. ఏదో మంచి ఖరీదయిన పరాయి ప్రాంతాలలో ఉన్నట్లుంది. తన తండ్రి ఉద్యోగం చేసిన ఊరు అనే భావన ఆయనగారి మస్తిష్కంలో నుండి పూర్తిగా తుడిచిపెట్టుకొని పోయినట్లుంది.

అంతా కలయతిరిగి చూశాడు. ఊరిలోని మామిడివాసనలు మచ్చుకయినా కానరావడం లేదు. వచ్చిన పనిని వివరించి చెప్పాడు.

"క్షమించండి బాబయ్యా! ఇక్కడ కామరాజుగడ్డే కాదు. కదిరి, కంగారోళ్లపాలెం, కాలవపల్లిలలో ఎనక సీజన్‌లో మామిడి తోటలు ఏపుగా ఉండేవి. దిగుబడి ఫలసాయం బాగా వచ్చేది.

ఈ ప్రాంతాల నుండి వందలాది లారీలతో మామిడిపళ్లు పరాయి ప్రాంతాలకు, రాష్ట్రాలకు అమ్మకానికి పోయేవి. అటువంటిది ఇప్పుడు ఎక్కడా పళ్ల పేరూ లేరు, పళ్ల లారీలూ లేవు.

"మరి... ...'

"మరి ఏమీ లేదు బాబూ. కారులో పోతున్నారు గదా! మరీ కావాలంటే ఎక్కడ కనిపిస్తే అక్కడ ఆగి ఖరీదు చేసుకొని పోవడమే!!"

మహాత్మకు మనసు ఘనీభవించినట్లయిపోయింది. నోటిమాట కరువయిపోయేసరికి అన్యమనస్కంగానే కారును స్టార్ట్ చేశాడు.

* * *

"నేడిడిగింది కామరాజుగడ్డ జాతి మామిడి ఫలాలు. ఇక్కడి కాకరపర్రు కాయలు నాకెందుకంటావు చెప్పు!" నిలేసిన తండ్రి ముందు మహాత్మకు మాట పెగలడం లేదు. లోలోపలి అంతరంగ సంవేదన ఆయనగారి ముఖంలో ప్రస్ఫుటమవుతూనే ఉంది.

"ఇప్పుడు ఆ ఊరే లేదు. అన్నీ గత చరిత్రలయిపోయి కాలగర్భంలో కలిసిపోయాయి. నన్ను నమ్ము నాన్నా. నీ అలనాటి మధురాలన్నింటికీ చెల్లుచీటి రాయాల్సిందే!" ప్రస్తుత పరిస్థితులను వస్తూన్న సమూల మార్పులను తండ్రికి వివరంగా చెబుతున్నాడు, మహాత్మ.

ఈ మధ్య వినికిడి పూర్తిగా మందగించిన బ్రహ్మయ్యగారికి కొడుకు మాటలలోని వాస్తవాలు ఏమాత్రం అర్థమయ్యాయో తెలీదు గాని, కొడుకు మాటల్ని వినలేకపోతున్నాడు.

పచ్చని పల్లెల తాలూకు ఆకుపచ్చని జ్ఞాపకాలను తన బుర్ర నుండి చెరిపేసుకోలేక పోతున్నాడు.

ఆ నేపథ్యంలో తీవ్రమైన అంతరంగ అలజడితో కలత చెంది అలా గట్టిగా తన రెండు చెవులను మూసుకుంటున్నాడు, బ్రహ్మయ్య.

■



# కాశీ.. మహా పుణ్యఫల రాశి!

**రుతువుల్లో వసంతరుతువు చాలా మంచిది. ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది. పగటి వేళల్లో ఎండ ఎంతగా బాధించినా సాయంత్రం అయ్యేసరికి చల్లని వాతావరణం, అలాగే ఉదయం కూడా ఎంతో ఆహ్లాదం మానవాళిలో కొత్త కొత్త ఆశలను రేపుతుంటుంది. ఈ దృశ్యం మహా స్మశానంగా పిలువబడే కాశీలో గంగానది ఒడ్డున అయితే ఎలా ఉంటుందో ఒకసారి ఊహించుకోండి.**

వైశాఖ పౌర్ణమి, గంగానది ఒడ్డున చీకటిపడ్డాక ఆ వాతావరణంలో కూర్చుంటే గంగానది మీదుగా వీస్తున్న చల్లని పిల్లగాలులు దశమేశ్వర్ ఘాట్‌లో గంగా హారతికి సన్నద్ధమవుతున్న పురోహితులు, మణికర్ణికా ఘాట్, సత్య హరిశ్చంద్ర ఘాట్‌లో దగ్ధమవుతున్న మృతదేహాలు.... అక్కడి పరిస్థితి విచిత్రంగా ఉంటుంది.

గంగానది ఆవలి ఒడ్డునుంచి చూస్తే ఏది గంగాహారతి ఇస్తున్న ప్రదేశమో, ఎక్కడ శవాలను దగ్ధం చేస్తున్నారో వెంటనే అర్థం కాదు. హర హర మహాదేవ్... అంటూ ఉదయాన్నే మహాశివుణ్ణి కొలుస్తూ తడి బట్టలతో విశ్వేశ్వర్ మందిర్‌కు వెళ్లే భక్తుల కోలాహలం ఒకవైపు...

రామ్ నామ్ సత్య్ హై.. అంటూ సత్య హరిశ్చంద్ర ఘాట్‌కు వెళ్లే పుర వీధుల్లో శవయాత్ర సాగిస్తూ మృతుని బంధువులు చేసే నినాదాలు మరోవైపు కొత్తగా కాశీ యాత్ర చేసిన భక్తులకు విచిత్రంగా అనిపిస్తుంది.

ప్రధాన మార్గాలను పక్కకు పెడితే అంతర్గత రోడ్లు ఏవీ అయిదు నుంచి ఎనిమిది అడుగులు మించవు. అక్కడ ప్రతినిత్యం వ్యాపారాలు, వ్యవహారాలు కొనసాగుతూ ఉంటాయి. ఒక పక్క తినుబండారాలు విక్రయిస్తుంటారు. ఆ పక్కనుంచే దహనానికి మృతదేహాలు హడావిడిగా గంగ ఒడ్డుకు వెళ్లిపోతుంటాయి. మరో పక్క గంగ ఒడ్డున పురోహితులు అన్ని రాష్ట్రాలవారు గంగ ఒడ్డుని ఆవాసంగా చేసుకుని కర్మకాండలు నిర్వహిస్తూంటారు. ఎవరి ఆచారం ప్రకారం వారికి అక్కడి పాండాలు ఆయా పద్ధతుల్లో కర్మకాండలు జరిపిస్తారు.

మాసికాలకు, తద్దినాలకు, సంవత్సరీకాలకు ఇంకా తుది రోజున కూడా కొందరు పితృదేవతలకు పిండ ప్రదానాలు చేసేందుకు కాశీ ప్రయాణం కడుతూ ఉంటారు. మరికొందరైతే జీవితంలో అన్ని బాధ్యతలు నెరవేర్చుకుని శివ శివా అంటూ కాశీపట్టణంలో గది అద్దెకు తీసుకుని శేష జీవితాన్ని గడిపేందుకు అక్కడ స్థిర నివాసం ఏర్పరచుకున్న వృద్ధుల సంఖ్య వేలల్లోనే ఉందని చెప్పాలి.



### కాశీలో ఉచిత వసతులు...

తెలుగు రాష్ట్రాల నుంచి వచ్చే భక్తులకోసం ఉచిత భోజన పథకాలు, వసతి సౌకర్యాలు అందించే తారకరామ ఆంధ్ర ఆశ్రమం, కరివెన సత్రం, సైకిక్ బాబా ఆశ్రమం వంటి అనేక ఆశ్రమాలు నెలకొని ఉన్నాయి. కొందరు ఆశ్రమ నిర్వాహకులు ఆశ్రయంతో పాటు ఆహారం కూడా ఉచితంగానే అందిస్తుంటే, మరికొందరు నామమాత్రపు అద్దెను వసూలు చేసి భక్తులకు సేవలు చేస్తున్నారు. అయితే ఒంటరిగా వెళ్లేవారికి మాత్రం ఆశ్రమాల్లో వసతి దొరకడం కష్టమే.

జీవితంలో ఏదో పెద్ద విషయంలో అంటే ఉద్యోగం సంపాదించుకోలేకపోవడం, ప్రేమ విఫలం కావడం, అయినవారందరూ మోసం చేయడం లేదా తానే ఇతరులను మోసం చేసి పశ్చాత్తాపపడి ఆత్మహత్య చేసుకునేందుకు కాశీ వచ్చేవారు కూడా ఎక్కువ కావడంతో ఒంటరి గాళ్లకు వసతి కల్పించడానికి సాధారణంగా ఎవరూ ముందుకు రావడం లేదు.

కాశీ విశ్వనాథుడి గురించి ఎంత చెప్పినా తక్కువే. కలియుగంకంటే ముందునుంచి కాశీ క్షేత్రం ఉందని మన పురాణాలు చెపుతున్నాయి. కాశీలో కొందరు ఒక నిద్ర చేస్తే మరికొందరు మూడు, ఇంకా గర్భవాసం పేరుతో తొమ్మిది నిద్రలు చేసి గంగా స్నానం చేసి శ్రీ కాశీ విశ్వేశ్వరుడిని దర్శించుకునే భక్తుల సంఖ్య కూడా తక్కువేమీ కాదు.





విశ్వేశ్వరుడిని చూడాలని ఎంతో భక్తి, తపనతో గర్భగుడిలో అడుగుపెట్టిన భక్తులకు పోలీసులపై పట్టరాని ఆగ్రహం కలుగుతుంది. ఏం చేయలేం! కాబట్టి శివ శివా అనుకుంటూ కోపాన్ని పంటికిందే నొక్కిపెట్టి బయట పడుతుంటారు.

జీవితంలో ఎన్నో కార్యాలు చేస్తూ ఉంటాం. అయితే మనసు అలసి సొలసినప్పుడు శారీరకంగానూ, మానసికంగాను కాస్తంత విశ్రాంతిని కోరుతుంది. అటువంటి విశ్రాంతి సంపూర్ణంగా మాకు కాశీలో లభించిందని అనేకమంది భక్తులు పలుకుతూ ఉంటారు.

## పరిశుభ్రత శివశివా..

కాశీని సందర్శించేవారు పరిశుభ్రత విషయాన్ని ఏమాత్రం పట్టించుకోకపోవడం మంచిది. ఎందుకంటే అక్కడి రోడ్లు ఇరుకైనవని ముందే చెప్పుకున్నాం. ఆవులు, కుక్కలు తదితర జంతువులన్నీ ఆ రోడ్లపైనే మల మూత్ర విసర్జన చేస్తుంటాయి. అలాగే కాశీపట్నంలోని అనేకమంది నివాసితులు కూడా శుభ్రత విషయాన్ని పెద్దగా పట్టించుకోరని భక్తులు ఆరోపిస్తుంటారు. వ్యర్థాలన్నీ రోడ్లపైనే పారేస్తుంటారు. అంతేకాకుండా పట్నంలోని మురికి తూములన్నీ కూడా గంగలోనే కలుస్తున్నాయి. దీంతో గంగనీరు కలుషితమౌతోందని గంగోత్రి సేవా సమితి గగ్గోలు పెడుతోంది. గంగ ఒడ్డున ఉన్న వ్యర్థాలను తొలగించేందుకు 64 ఘాట్లలోనూ పారిశుధ్య కార్మికులను ఏర్పాటు చేసి రోజూ వ్యర్థాలను ముఖ్యంగా ప్లాస్టిక్ కవర్లను గంగలో కలవకుండా చర్యలు తీసుకుంటున్నట్లు గంగోత్రి సేవాసమితి ప్రముఖులు ఆనంద్ పాండే, విష్ణుకుమార్ పాండే తదితరులు భక్తులకు తెలిపారు.

వారు సాగిస్తున్న సేవలు స్థానిక ప్రజల ప్రశంసలు అందుకున్నప్పటికీ కాశీ పట్నవాసులు మాత్రం తమ ఇంటి పరిసరాలను శుభ్రంగా ఉంచడంలో విఫలమవుతూ వస్తున్నారు.

## విశ్వేశ్వరుడి దర్శనభాగ్యం...

24 గంటలు సాయుధ బలగాలు ఆలయ పరిసరాలను పర్యవేక్షిస్తూంటారు. ఎంతో భక్తితో విశ్వనాధుని దర్శించుకుని కొబ్బరికాయ కొడదామంటే టెర్రరిస్టుల పుణ్యమా అని కొబ్బరికాయ కొట్టడం ప్రభుత్వం నిషేధించింది. దీంతో స్థానికంగా లభ్యమయ్యే మారేడు దళాలు, గన్నేరుపూల దండను, నీళ్ల కలిపిన పాలను కాశీవిశ్వేశ్వరుడి లింగంపై కుమ్మరించి ఒక్కసారి మనసారా విగ్రహాన్ని చూసి మొక్కేలోపే అక్కడున్న పోలీసులు ఒక్కతోపు తోసి భక్తుల్ని ముందుకు తోసి ఛలో ఆగే అంటారు. దీంతో ఎన్నో ఏళ్లుగా కాశీ దేశ ప్రధాని శ్రీ నరేంద్ర మోడీ గెలిచిన కాశీ నియోజకవర్గం ఉండాల్సింది అలా కాదనిపిస్తుంది... యోగి ఆదిత్యనాథ్ ముఖ్యమంత్రిగా ఉన్న అంతటి పవిత్రమైన, పురాతనమైన నగరం ఇంకా ఇలా ఉందా? అనిపించకమానదు భక్తులకు.

సత్య హరిశ్చంద్రుడి గురించి తెలియని భారతీయులుండరంటే అతిశయోక్తి కాదేమో. సత్య వాక్పరిపాలకుడైన హరిశ్చంద్రుడు స్వయంగా స్థాపించిన మహిమాన్వితమైన శివలింగాన్ని కూడా కాశీలో దర్శించవచ్చు. కాశీలో సత్య హరిశ్చంద్ర ఘాట్‌లోను, మణికర్ణికా ఘాట్‌లోనూ దహన సంస్కారాలు జరుగుతుంటాయి.

## పుణ్యస్నాన విశేషాలు..

కాశీపట్నంలో ఉన్న 64 ఘాట్లకు 64 కథలు ప్రచారంలో ఉన్నాయి. సత్యహరిశ్చంద్ర ఘాట్‌లో అంత్యక్రియలు చేసినవారు మాత్రమే స్నానం చెయ్యాలని చెపుతారు.

మణికర్ణికా ఘాట్‌లో మిట్ట మధ్యాహ్నం 12 గంటలకు గంగా స్నానం చేసి, గట్టుపైన ఉన్న చిన్న బావిలో స్నానంచేసి, మరల గంగాస్నానం చేస్తే ఇక భక్తునికి జీవితాంతం మైల అనేదే ఉండదట.

కేదారేశ్వర ఘాట్‌లో స్నానం ఎంతో పుణ్యం, నారద ఘాట్ కలహాలకి నిలయమని, దశమేశ్వర్ ఘాట్‌లో స్నానం పాప ప్రక్షాళనమని, మానస సరోవర్ ఘాట్ మానసిక ప్రశాంతత నిస్తుందని.. ఇలా అన్ని గంగా ఘాట్లలో స్నానాలు నిర్ణీత వేళల్లో స్నానమాచరిస్తే ఉత్తమ జన్మలకు సోపానమని పండితులు చెపుతారు.

తొమ్మిది రోజుల గంగాస్నానం, విశ్వేశ్వరుని దర్శనం, కాశీ అన్నపూర్ణమ్మ గుడి...దశమేశ్వర ఘాట్‌లో గంగోత్రి సేవా సమితి సభ్యులచే గంగా హారతి తిలకించడం ఎంతో సంతృప్తినిస్తాయి.

–ప్రయాగ నాగేశ్వరరావు

# గుండెను బండగా చేసుకొని....

**గుండెను** బండగా చేసుకొని...
స్వార్థాన్ని శ్వాసగా పీల్చుకొని...
అవినీతినే ఆయువు మలచుకొని...
మనిషినన్న మాట మరచి
మరయంత్రంలా సాగిపోతున్న
సగటు మానవుడి ముందు
ప్రకృతి మోకరిల్లక తప్పడం లేదు

కొండను పిండి చేసి...
భూమిని పచ్చిపుండు చేస్తున్న
మడిసికి... మానుకి తేడా ఏముంది!
పులినైనా.. జింకనైనా వేటాడగలడు
వేటాడి డబ్బు సంపాదించే లక్ష్యమే
కళ్లముందు
కనిపిస్తుండగా....
తల్లినైనా... పిల్లనైనా బలి
తీసుకుంటాడు
చెట్టు చెలమలు... చేను చింతలు
పట్టించుకోని పాశాన హృదయుడికి
నాట్యంకన్నా నెమలి మాంసమే రుచి అంటాడు
అడవులు నరికి... పంటను మరచి
కాంక్రీట్ జంగిల్ సృష్టికర్తకు
నడిచే మేఘాలు పిలిచే పక్షులు
మైమరపించే ప్రకృతి అందాలు
ఒట్టి ట్రాష్.. పాడు చేయడమే
పరమావధిగా ఎంచిన వాడికి
గుండె స్థానంలో బండ వుందనక తప్పదు.

– ఎం.వి.స్వామి

---

# తను

**వెండి** వెన్నెల పరదాలను తొలగించుకుంటూ....
మంచుమేఘాల దారులను దాటుకుంటూ....
తొలి సంధ్యవేళ సాగిపోతున్న మలయమారుతంతో
పాటుగా....
ఉషోదయ ఉదయాల వేళ అరుణవర్ణం శోభను
అలంకరించుకుంటూ....
కదలివస్తుంది తను...
నా కళ్లలో సజీవంగా నిలిచిన తన రూపం
నిలిచినట్లే నిలిచి అంతర్ధానమవుతుంది.
కలో... నిజమో... కలవరమో...
అర్థమవని అయోమయ స్థితి నాది!

– జి.శ్రీను

---

# కౌలు రైతు కంటనీరు

**కదిలే** కాలం
కన్నీరే మిగల్చగా
బతుకు భారమై
భగవంతునిపై భారం వేసి
తొలకరి వాన తొంగిసూడంగా
ఆశయాల హలం పట్టి
బీడువారిన ఎద కమతాల
దున్ని
చదును చేసి
ఆశలన్నింటిని విత్తులుగా
చేసి
స్వేద బిందువులతో సేద్యం చేసి
బాధల తెప్పలు రాల్చే
కన్నీటి వర్షాలతో
ఆరుతడి పెట్టి
సాగుబడి చేసి
చీడపురుగుల తొలచ
అప్పుల మందులు చల్లి
కనురెప్పోలే పంట కాచి
ఆశల పంటలు పోగు చేసిన
సంబురం ఎంతసేపు
పండిన పంటను అమ్మలేక
మద్దతు ధర ఎటూ లేక
దగాకోరు దళారుల
దొంగలెక్కల అమ్మకాలతో
రైతు దగా పడిండు

వగచి వెగచి
వేసారి, బేజారై
కుదేలై, కునారిల్లి
గుండెలవిసేలా రోదిస్తూ..
నిట్టూర్పుతో, నిగ్రహంతో
నిఖార్సైన పంటను
నిప్పుల పాల్జేస్తూ
కనికరం చూపేవారే లేక
బరువెక్కిన అప్పుల తీర్చ
కొంపా గోడూ అమ్మజూసే
కౌలు రైతులకు కన్నీరే మిగిలే!

– వీరగోని రమేశ్

---

# అక్షరాలు

**ఈ** అక్షరాలు పాతవే
మీరంతా ఎరిగిన అక్షరాలే
కొత్తవేమీ కాదు
నేను చిన్నప్పుడు
ఇసుకలో దిద్దినవి
ఎలిమెంటరీ స్కూల్లో నేర్చుకున్నవీ
ఈ అక్షరాలే కద

అయితే నేను పెరిగి పెద్దవాణ్ణయి
అక్షరం ముక్కలు నేర్చి
పెద్ద చదువులు చదివి
అక్షరల లక్షలు సంపాదిస్తుంటే
ఇప్పుడు నాకు ఆశ్చర్యం!
ఈ అక్షరాలు ఈ విద్యవేనా
నన్నింతవాణ్ణి చేసింది
గొప్పవానిగా నిలబెట్టింది.
గ్రంథాలు చదివి
జ్ఞానవంతుణ్ణయి
పది మందిలో నిబ్బరంగా
తిరుగుతున్నాను
పెద్దా చిన్నా అందరి మన్ననలను
పొందగలుగుతున్నాను
అక్షరానికి నమస్కారం
అందరికి నమస్కారం.

– భూషి కృష్ణదాసు

# మురజవేధ అంటే ఏమిటి?

**ఒక** గృహానికి సింహద్వారం చాలా ముఖ్యమైనది. సింహ ద్వార నిర్మాణానికి ఉపయోగించే కలప, కలప ముక్కల సంఖ్య, ద్వార బంధ ప్రతిష్ఠ విధానం, ముహూర్తం మొదలయిన అనేక విషయాలలో చాలా జాగ్రత్తలు పాటించవలసి ఉంటుంది. 'ద్వారబంధ ప్రతిష్ఠ'లో ఏ చిన్న పొరపాటు జరిగినా 'మురజ వేధ' దోషం చోటు చేసుకుంటుంది.

ద్వార బంధంతో కూడిన సింహద్వారం (నేరుగా వందంబానుసారం ప్రతిష్ఠింపబడక, ఏ కారణం చేతనైనా, పొరబాటు గానైనా) పార్శ్వములు హెచ్చు-తగ్గులుగా ఉన్నట్లయితే (వంకరగా గానీ, ద్వార బంధ నిర్మాణంలో వచ్చిన లోపంవలన గానీ) 'మురజవేధ' దోషం కలుగుతుంది. ఇలాంటి దోషం 'వంశాభివృద్ధి' విషయంలో దుష్పరిణామాలను కలుగ జేస్తుంది.

సంతానం కలగకపోవటం, వంశాభివృద్ధి వృద్ధి కుంటుబడటం, వంశాకురం విషయంలో ఫలితం కనబడకపోవటం, వంశం నశించిపోతుందేమోనని భయాందోళనలు కలుగుతున్నట్లయితే కుటుంబ యజమాని తను నివాసముంటున్న లేదా స్వంత ఇంటి సింహద్వారానికి 'మురజ వేధ' దోషం ఉందేమోనని ఒకసారి చూసుకోవలసిన ఆవశ్యకత ఉంది. సంతానం కలగపోవటానికున్న అనేక భౌతిక కారణాలలో ఇలాంటి వాస్తు దోషాలుండటం కూడా ఒక కారణం. వాస్తు దోషం వలన కలిగే చెడు ఫలితాలు ఆ వాస్తు దోషాలను సవరించుకోవటం వలన తప్పకుండా నివారించబడతాయి. ఒకవేళ సింహద్వార ప్రతిష్ఠలో మురజవేధ దోషముంటే ఆ దోషాన్నుండి గట్టెక్కి చక్కని సంతానాన్ని పొంది, వంశాభివృద్ధిని పోషించవచ్చు.


## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ

డా॥ దంతూరి పండరినాథ్

3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3

సెల్స్: 9885446501/ 9885449458




### నైరుతి వీధిపోటు మంచిదేనా?

**నాగేశ్వరరావు - భీమవరం**

**ప్రశ్న: ఈ ఇంటిని కొనాలను కుంటున్నాను. ప్లాను పంపిస్తున్నాను. ఈ ఇల్లు వాస్తు ప్రకారం వున్నదా? ఈ ఇంటికి నైరుతి వీధిపోటు వున్నది. ఈ వీధిపోటు వలన ఈ ఇంటికి ఎటువంటి ఫలితాలుంటాయి?**

**జవాబు:** పశ్చిమ నైరుతి వీధిపోటు సాధారణంగా ఆరోగ్యపరమయిన చెడు ఫలితాలనిస్తుంది. అందువల్ల అలాంటి ఇళ్లను కొనకపోవటమే మంచిది. ఒకవేళ ఇలాంటి ఇళ్లల్లో వుండటం తప్పనిసరైనప్పుడు ఈ వీధిపోట్ల దోష సాంద్రతను తగ్గించే ప్రత్యామ్నాయ పద్ధతులున్నాయి. వాటిని ఉపయోగించుకొని నివసించవచ్చు.

### వాస్తు దోషాలున్నాయా?

**గోవిందరాజులు - విశాఖపట్నం**

**ప్రశ్న: మాకు తీవ్రమయిన సమస్యలేవీ లేవు. కానీ ఇంటికి వచ్చిన బంధువులు, స్నేహితులు ఇంటి వాస్తు గురించి తీసుకోవలసిన జాగ్రత్తలు, మార్పులు చెప్తున్నారు. యంత్రాలు పెట్టి పూజించమంటున్నారు. ఏంచేయాలో మీరే చెప్పండి.**

**జవాబు:** మీకు ఎలాంటి సమస్యలు లేకపోతే మీ ఇల్లు బాగున్నట్టేనని అనుకోండి. ఏమైనా వాస్తు దోషాలున్నట్టు కనబడినా మార్పులేమీ చేయకండి. ఫలితాలు మీకు సంతృప్తికరంగా వుంటే ఏ యంత్రాలు పెట్టుకోనవసరం లేదు. వాస్తు దోషాలున్నప్పటికీ వాటిని బ్యాలెన్స్ చేసే మరిన్ని వాస్తు అనుకూల విషయాలు కూడా మీకు తెలిసో, తెలియకో నిర్ధారించుకోవచ్చు. మీకు తీవ్రమయిన సమస్యలేవీ లేవు. కాబట్టి ఇంటి వాస్తు విషయం ఆలోచించనవసరం లేదు.

### ఉత్తర ఈశాన్యంలో సింహద్వారం ఉండవచ్చా?

**శిరీష - కోదాడ**

**ప్రశ్న: ఇంటి ప్లాను చూసి ఎలా వుందో తెలుపగలరు. ఉత్తర ఈశాన్యంలో స్థలం వదలకుండా సింహద్వారం వచ్చింది. అలా వుండకూడదు అని అంటున్నారు. దాన్ని ఇవతలకు జరపటానికి అవకాశం లేదు. ఎందుకంటే ఇటుపక్క పిల్లరు వచ్చింది. కిటికీలు అయిదు వున్నాయి. ఇంకో కిటికీ పెట్టాలి అంటే ఎక్కడ పెట్టాలి? నైరుతిలో ఇదివరకు టాయిలెట్స్, బాత్‌రూమ్ వుండేవి. ఎవరో వద్దన్నారని అది తీసేసి స్టోర్ రూమ్‌గా మార్చాం.**

**జవాబు:** పూర్తి ఈశాన్య మూలనానుకొని తలుపు పెట్టకూడదు. కనీసం 4 అం. మూలమొత్తం వదిలిపెట్టాలి. తలుపు (సింహ ద్వారం) పక్కకు జరపటానికి పిల్లరు అడ్డంగా వస్తుందంటున్నారు. అటువంటప్పుడు సింహద్వారం కట్టుబడి స్థలం (పిల్లర్ల మధ్య స్థలం) దాటి వుందని బోధపడుతోంది. ఇది కూడా తీవ్రమైన వాస్తుదోషమే అవుతుంది. మీరు అడిగిన విషయాలే గాక తెలిపిన అనేక విషయాల వలన నేనివ్వదలచిన సలహా ఏమిటంటే-

మీరు మీ ఇంటి వాస్తును క్షుణ్ణంగా చూపించి సలహా పొందటమే మంచిది. మీరు కోరిన మేరకు మిగతా విషయాలు పేర్కొనటం లేదు.

### ఇల్లు మారేటప్పుడు ఎటువైపు వెళ్లాలి?

**సాయిప్రభు - విజయవాడ**

**ప్రశ్న: ఇల్లు మారేటప్పుడు ఎటువైపు వెళ్లవచ్చు. నామ నక్షత్రాన్నిబట్టి ఏవైనా నియమాలున్నాయా?**

**జవాబు:** ఈ విషయంలో నామ నక్షత్రాన్నిబట్టి నియమాలేవీ లేవు. కానీ ఒక ఇల్లు (అది కిరాయి ఇల్లయినా, సొంతంగా కట్టుకున్న ఇల్లయినా సరే) మారేటప్పుడు, మారబోతున్న ఇల్లు ప్రస్తుతమున్న ఇంటికి తూర్పు దిక్కునగానీ, ఉత్తర దిక్కునగానీ, ఈశాన్య దిక్కున గానీ వుంటే మంచి ఫలితాలుంటాయన్న విషయం చాలా కాలంగా వున్నది.

వాస్తు నియమాలు మామూలే! ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ---------------------------------------

పుట్టినతేదీ:------------------- ఊరు: ----------------

జన్మనక్షత్రం:----------తల్లిపేరు:----------------------

చిరునామా: -----------------------------------------

------------------ ఫోన్: ------------------------

# పిల్లల్లో పోటీతత్వం!

## పర్సనల్ పాయింట్

చల్లా సుబ్రహ్మణ్యం
1 సి-ఐక్యూ టవర్స్, 3-4-540,
నారాయణగూడ, హైదరాబాద్-27
మొబైల్: 9866362224/ 9553662224
challascounsel@gmail.com
www.challascounsel.com



- ఎస్.ఎన్ - నెల్లూరు

ప్రశ్న: మాకు పెళ్లయి 10 ఏళ్లు. మాది ప్రేమ వివాహం. మా వైవాహిక జీవితంలో ఎలాంటి గొడవల్లేవు. మాకు కవల పిల్లలు. ఇద్దరూ అబ్బాయిలు. వాళ్లకు 6 ఏళ్లు. వయసు 6 ఏళ్లే అయినా వాళ్లు చేసే పనులకి మాకు రోజూ షాకే. పెద్దవాడు పర్వాలేదుగానీ చిన్నవాణ్ణి భరించడం కష్టం. ఒక విధంగా చిన్నవాణ్ణి చూసి పెద్దవాడు కూడా అలాగే తయారవుతున్నాడు. అసలు సమస్య ఏమిటంటే 'పోటీతత్వం' ఇద్దరికీ ఎక్కువ. ఒకళ్లు ఏం చేస్తే రెండోవాడు కూడా అదే చేస్తానంటాడు. ఎప్పుడూ పోటీ పడి కొట్టుకుని చివరకు ఏడుపుతో ఆగిపోతుంది. చిన్నవాడికి ప్రతిదీ గొడవతోనే మొదలవుతుంది.

పోటీ పడే ఈ మనస్తత్వం మంచిదని నా నమ్మకం(ఇదివరకు). కానీ జరుగుతున్నవి చూస్తుంటే నా అభిప్రాయం తప్పనిపిస్తుంది. ఇదే మనస్తత్వంతో పిల్లలు పెరిగితే వీళ్లు ఎలా తయారవుతారో అని భయంగా వుంది. 2 నుంచి 6 ఏళ్ల వయసులో పిల్లల ధోరణి, ఆలోచనలు వాళ్లు పెద్దయ్యాక ఎలా అవుతారో తెలియజేస్తుందని మీరు చెప్పారు. మా పిల్లల్ని ఎలా కంట్రోల్ చెయ్యాలి? వాళ్లకు కౌన్సెలింగ్ ఇస్తారా?

జవాబు: పోటీతత్వం అంటే 'చెడ్డది' ఏమీ కాదు. పోటీ అనేదే లేకపోతే ఏ విషయంలోనూ అభివృద్ధి సాధ్యంకాదు.

సో.. జీవితంలో పోటీ అనేది ప్రతి స్థాయిలోనూ అవసరమే. అయితే ఆ పోటీ అనారోగ్యకరంగా మారి పందేలకోసం తయారయ్యే గుర్రాల మధ్య పోటీలాగా మారకూడదు. తెలిసీ తెలియని వయసులో పోటీతత్వాన్ని ఒక మత్తుమందులాగా ఎక్కించి పందెంకోడిలాగా తయారు చెయ్యడం తప్పు. ఒకసారి ఆ వ్యసనం బారిన పడితే అది పులిమీద స్వారియే. ఆ ఒత్తిడిని తట్టుకోలేక అందులో నిలబడలేక విజయం సాధించనూలేక పెద్దయ్యాక ప్రమాదకరమైన 'అణుబాంబు' లాగా మారి జీవితాలను అంతం చేసుకునే పిల్లలు కోకొల్లలు. మీ పిల్లల విషయంలో మాత్రం కౌన్సెలింగ్ పిల్లలకన్నా తల్లి దండ్రులకే ఎక్కువ అవసరం అనిపిస్తోంది. వాళ్లను (పిల్లల్ని) తీసుకుని రండి. ఎలా హేండిల్ చెయ్యాలో నేర్చుకుందురుగాని.

## నాకున్న జబ్బు ఏవిటి?

వి.హెచ్ - శ్రీకాకుళం

ప్రశ్న: నా వయసు 27. ప్రైవేట్ జాబ్ చేస్తున్నాను. మా కుటుంబంలో నేనందరికన్నా చిన్నవాణ్ణి. నా సమస్య ఏమిటంటే నేను చాలా భయస్తుణ్ణి. ప్రతి చిన్న విషయానికి భయపడతాను. ఒంటరిగా ఎక్కడికైనా వెళ్లాలన్నా, ఏదైనా కొత్త పని మొదలుపెట్టాలన్నా, ఎవరితోనైనా మాట్లాడాలన్నా, ఏదైనా అడగాలన్నా... ఇలా ప్రతి విషయంలోనూ భయపడి, ఎక్కువగా ఆలోచించి చివరికి ఆ పని ఏదో విధంగా వాయిదా వేస్తాను. మీకు ఉదాహరణ ఇవ్వాలంటే- మీకు ఈ ఉత్తరం రాయడానికి నాకు మూడు నెలలు పట్టింది. అసలేం రాయాలి? ఎలా మొదలుపెట్టాలి? ఏ పెన్‌తో రాయాలి? రాసాక ధైర్యం కూడగట్టుకుని పంపడానికి ఇంకో నెల. ఇలా సమయం వృధా చేస్తున్నాను. బయటికి గంభీరంగా కనిపిస్తున్నా నాతో నేను చాలా ఇబ్బంది పడుతున్నా. అసలేపని చేయాలన్నా ఎలాగూ నేను చేయలేను కదా... అనే భావంలో మొదలుపెట్టకుండా ఆపేస్తున్నా. నన్ను నేనే క్షమించుకోలేకపోతున్నా. ఎంతో కష్టపడి మూడు నెలలుగా ఆలోచించి ఈ ఉత్తరం మీకు రాస్తున్నా. నాకున్న జబ్బు ఏమిటి? నేను మారతానంటారా?

జవాబు: తప్పకుండా మారతావు విజయ్! నీకు ప్రత్యేకమైన జబ్బు అంటూ ఏమీ లేదు. ఇది నీ తత్వానికీ, నైజానికీ సంబంధించిన సమస్య. విషయాల్ని వాయిదా వేయడం మానవ సహజమే! కానీ ఆ వాయిదాని రెగ్యులర్‌గా (రేపు అని గోడమీద రాసుకున్నట్లు) వాయిదా వేస్తున్నావు చూడు... అది తప్పు. దాన్ని జయించడానికి నేను నేర్పించే 'మనో ప్రాణయోగ' ఉపయోగపడుతుంది. ప్రతి చిన్న విషయానికీ భయపడడం.. అతిగా ఆలోచించడంవల్లే జరుగుతోంది.

ఏ పనికి ఎంత శక్తి ఉపయోగించాలి? ఏ విషయం గురించి ఎంత ఆలోచించాలి? ఏ సబ్జెక్ట్ చదవడానికి ఎంత శ్రమ పడాలి? అనేవి అన్నీ మన సామర్థ్యాన్నిబట్టి విచక్షణతో నిర్ణయించాల్సిన విషయాలు. ఆ విచక్షణకోసం కూడా కౌన్సెలింగ్ పనికొస్తుంది. ■

## తనే ముందు ఉండాలట!

- బి.ఎన్.కె - హైదరాబాద్

ప్రశ్న: నా వయసు 24. ఈ మధ్యనే పెళ్లి సెటిలైంది. మరో 3-4 నెలల్లో పెళ్లి అనుకుంటున్నారు. నాక్కాబోయే భర్త బిల్డర్. అమెరికాలో మాస్టర్స్(ఎమ్ఎస్) చేసి వచ్చాడు. మనిషి మంచివాడే. నేనంటే చాలా ఇష్టం వున్నట్లుగా మాట్లాడతాడు, ప్రవర్తిస్తాడు కూడా. అతని వ్యక్తిత్వం నాకు కొంచెం భయాన్ని కలిగిస్తోంది. అతను తన వ్యాపారంలో చాలా గొప్పవాడు అవాలని అనుకుంటున్నాడు. బాగా డబ్బు సంపాదించి దేశంలోని బిలియనీర్స్‌లో అందరికన్నా ఉన్నత స్థాయికి చేరాలని అతని కోరిక. బాగా డ్రైవింగ్ చేస్తాడు. తనను ఎవరు దాటివెళ్లినా తట్టుకోలేడు. అవమానంగా భావిస్తాడు. ఆ వెహికిల్‌ని ఓవర్ టేక్ చేసే వరకు వదిలిపెట్టడు. కనుచూపు మేరలో తనకన్నా ముందు కారుగానీ, ఏ వెహికిల్‌గానీ కనిపించకూడదు. అదేదో రూల్‌లాగా పెట్టుకుని మెయింటెయిన్ చేస్తాడు. మాకు ఎంగేజ్‌మెంట్ అయింది కదా! అని అతనితో బయటికి వెళ్లమంటారు పెద్దవాళ్లు. నాకెందుకో అతని తత్వం సరిగా అర్థం కావడం లేదు. సలహా చెప్తారా?

జవాబు: తల్లీ! అతని మనస్తత్వం నాకు అర్థమవుతోంది. వుండేది హైదరాబాదే కదా! ఓసారి అమ్మా, నాన్నలతో వచ్చి కలువు. వివరంగా చెప్తాను. వ్యాపారంలో ఎదగాలనుకోవడం, పోటీ పడడం, గొప్ప స్థాయికి రావాలనుకోవడంలో తప్పు లేదు. ఆశపడడం మానవ సహజం. అది అత్యాశ, దురాశగా మారితే ప్రమాదం. ఎదగడం తప్పు కాదు. తనకన్నా గొప్పగా మరెవరూ వుండకూడదు అనుకోవడం ముమ్మాటికీ తప్పే. ప్రపంచ కోటీశ్వరుల లిస్ట్ కూడా ప్రతి సంవత్సరం మారిపోతుంటుంది, స్థానాలు మారిపోతుంటాయి. ఇవన్నీ చాలా సహజంగా జరుగుతుంటాయి. ఇతనిది దూకుడు మనస్తత్వంలా అనిపిస్తోంది. డ్రైవింగ్‌లో ఇది మరీ ప్రమాదకరం. కనుచూపు మేరలో తనముందు ఏ వాహనం వుండకూడదు... అనుకుంటున్నాడంటే నాకు తన మానసిక స్థితిమీద అనుమానంగా వుంది. ఆలస్యం చెయ్యకుండా కలువు తల్లీ. గుడ్ లక్. ■

# పద మథనం-118

**- నిర్వహణ: వాడ్రేవు ఉమాశంకర్**



## ఆధారం

### అడ్డం

1. పూ తేనెలు గ్రోలే కీటకం-3
4. మహారాజుల శృంగార వినోద లీల-4
6. ఒక రకం మల్లెతో మొదలయ్యే- జాపత్రి తోడిది-4
7. తనువు-2
8. గడియారంలో వేలాడే పెండ్యులమ్-4
11. యోగ్యమైనది, సబబుగా ఉండేది-5
13. క్లిష్ట పరిస్థితి వస్తే మనం ఇందులోనే పడతాం-4
15. దూషణ-2
17. సేవకురాలు-2
18. ఇంటిముందు ముంగిలి- సభాస్థలి కూడా-4
21. గాంధీ కాకపోయినా- ముళ్లపూడికి సరిజోడి-2
22. తపాలాకన్నా ముందు వచ్చే వార్త-2
23. ఎత్తిపొడుపు మాటలకి అంటించే వాత-3
25. సరుకుల సముదాయంతో సతమతమయ్యే మనకి చేదోడు ఇదే-2
26. తెల్లవారదమే- వేకువ-3
28. ఆర్థికంగా అడుగు వేయలేక బక్కచిక్కిన పేదవాడు-3
30. సాయంత్రం లోపల ఈ మిషన్ కనిపెట్టాలి-3
31. నేటికీ కొన్ని ప్రాంతాల్లో కనిపిస్తున్న మూడు చక్రాల సైకిలు-2

### నిలువు

1. లేనిది ఉన్నట్టు కనిపించడం- అంతా ఉత్తిదే-2
2. ముస్లింల పర్వదినం-3
3. ఆకాసం ముందు మారితేనే వికసించడం-4
5. పూర్ణ ఫల జలం-4
8. వరద ముంపుకు ముందు గురయ్యేది ఈ ప్రదేశమే-
9. యాచకుడు కోరేది- భిక్షమే-
10. ఇది తిప్పితేనే మగతనం తెలుస్తుంది-
11. గోడపైనా, యేదుపైనా మనం చేసేది బుజ్జగించడమే-
12. శ్మశానంలో పేర్చేది-
14. పింగళి సూరనామాత్యుని సుప్రసిద్ధ కావ్యం-6
16. విపంచి-2
19. తరగతిలో సగం పోతే దిక్కేమిటీ?-2
20. పుస్తకానికి- లోపల కథ చెప్పే అట్టమీద బొమ్మ-4
24. 9 నిలువులో మనం వేసే ముద్ద-3
27. ముగ్గురు తిరగబడ్డారు-2
29. బాణాన్ని ఇది చూసే వదలాలి-2

## పద మథనం - 116 సరైన సమాధానాలు రాసినవారు

1. ఎ.సత్యనారాయణ-సూళ్లూరుపేట 2. సి.సి.ఎస్.రావు-డా॥ ఎఎస్ రావ్‌నగర్ 3.వి.సుజాత-తిరుపతి 4. వి.బి.టి.సుందరి-సరూర్‌నగర్ 5. పి.రాజేశ్వరరావు-అలకాపురి 6. ఎస్.శ్రీనివాస రావు-ఎమ్మిగనూరు 7. వి.కృష్ణమూర్తి-అద్దంకి 8. సి.ప్రవీణ్‌కుమార్, సి.పవన్‌కుమార్,సి.లక్ష్మీ నరసింహామూర్తి, సి.సరోజ, సి.సుబ్బారావు-సనత్‌నగర్ 9. ఎ.సుబ్బారావు-గుంటూరు 10. కె.వెంకట సుబ్బారావు-గిద్దలూరు 11. యస్.యస్.ఎగ్గోని, సి.రాజలక్ష్మి, ఇ.శ్యామసుందర్-పుప్పాలగూడా 12. ఎ.బాలసుబ్రహ్మణ్యం-కూకట్‌పల్లి 13. కె.లింగమ్మ, కె.శివాజిరెడ్డి-మాచర్ల 14. బి.కృష్ణమూర్తి-హుజూర్‌నగర్ 15. బి.యాదగిరి-ఉప్పల్ 16. అశోక్ కె.వి-ఓల్డ్ బోయినపల్లి 17. కె.లక్ష్మీకాంతమ్మ, ఆర్.సరళాదేవి, లక్ష్మీ సుహాసిని, హేమలత, కె.శ్రీదేవి-అనంతపురం 18. ఎ.బాలసుబ్రహ్మణ్యం-కూకట్‌పల్లి 19. కె.నర్సమ్మ, కె.శివాజీరావు-కోదాడ 20. పి.శ్యామలా రాధాకృష్ణ-మదనపల్లి 21. ఎ.సత్యనారాయణ బాబ్జీ, సుమతి-నిజాంపేట రోడ్ 22. నిర్మలక్రిష్ణ-బైరాగిపట్టెడ 23. డా॥ టి.పార్థసారథి-చైతన్యపురి

## పద మథనం - 117 సమాధానాలు



| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 స | రం | 2 గు | | 3 కాం | చ | 4 స | ము | | 5 స్వ | 6 రం |
| స్వం | | 7 హ | రి | తం | | క్ష | | 8 ప | క్ష | ము |
| | 9 మ | | | 10 క | రి | | 11 లా | | సి | |
| 12 ము | వో | లు | | ధ | | 13 న | వ | 14 ని | త | ము |
| | శ్య | | 15 బ | లు | సా | కు | | ల | | |
| 16 సా | ధ | న | | | | లు | | 17 కం | ప | 18 రం |
| రం | | | 19 కే | | | దు | | కు | | భ్రం |
| 20 గ | 21 గ | న | కు | సు | 22 మం | | 23 గా | దు | 24 గు | |
| 25 ధ | ర | | వ | | 26 భ్రా | బి | ద | | దా | |
| రు | | 27 మ | జా | | లం | | 28 వ | 29 యా | ర | ము |
| 30 దు | పి | | 31 ము | లా | యం | | | 32 భ | ము | |

పేరు:

ఊరు:

